# పాలెం
# శ్రీ ప్రసన్నాంజనేయ శతకము



గోవిందు గోవర్ధన్



డా॥ కె.వి. రమణాచారి గారితో కృతి కర్త




శ్రీ రంగాచార్య  గారు మరియు తదితరులతో కృతి కర్త



**శ్రీ & శ్రీమతి గోవిందు సాయిలు, నారమ్మ** మా పితరులు

## అమ్మ నాన్నల దీవెనలు

సీ॥ శ్రీకారమును చుట్టి జీవికల్ విలిగింప
శ్రద్ధను వీడక చదువుమనిరి
చిన్నపెద్దలనుండి మన్ననల్ గైకొని
మేటి వర్తన కల్గి మెలగుడనిరి
ముక్తికై హృదయాన భక్తి బీజమునాటి
వటవృక్షమై నిల్చు వదలకనిరి
గురుసన్నిధినిపొంది పరమాత్మునెరుకకై
నిత్యము మనసును నిలుపుమనిరి

తే॥ జన్మకారకుల్ నారమ్మ సాయిలులిక
స్వర్గసీమను చేరిరి శాశ్వతముగ
వారి ఆశీస్సువెన్నంటి వసుధపైన
మమ్ము నడిపించుచున్నది మరువలేము.



| | |
|---|---|
| జననం: | 15-6-1969 |
| పితరులు: | శ్రీ గోవిందు సాయిలు, |
| | శ్రీమతి నారమ్మ |
| స్వగ్రామం: | పాలెం |
| విద్య: | ఎం. ఏ, టిపిటి |
| వృత్తి: | అధ్యాపకత్వం |
| | శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ డిగ్రీ కళాశాల, |
| | పాలెం, నాగర్‌కర్నూల్ జిల్లా |
| గురువులు: | శ్రీమతి ములుకుట్ల సరస్వతమ్మ, |
| | శ్రీ రామకృష్ణ శాస్త్రులు |
| | డా॥ శ్రీరంగాచార్యులు, |
| | డా॥ గోపాలకృష్ణారావు |
| | డా॥ బాలభాస్కర్ |
| పద్య గురువు: | డా॥ వెలుదండ సత్యనారాయణ |
| అభిరుచులు: | ఆధ్యాత్మిక చింతన, |
| | పద్య రచన |



కృతికర్త : గోవిందు గోవర్ధన్

# విషయసూచిక

## పీఠికలు



## శతకపద్యాలు

19. ప్రభుత్వ ఉద్యోగాలు–ప్రవేట్ బడులు
20. ఆంగ్లమాధ్యమములో చదువులు
21. వైవాహిక బంధాలు విచ్ఛిన్నమగుట
22. అక్రమ వరకట్నము కేసులు
23. ఉత్తమ దాపంత్య జీవితము
24. శతకము వ్రాయాలన్న సంకల్పము
25. సహృదయుల ఆశీర్వచనాలు
26. వృద్ధాశ్రమాలు
27. ప్రతిభావిహీనులు ఉన్నత విద్యాపట్టాలు
28. అపురూప దాంపత్యముకొరకు శోధించుట
29. దుర్బుద్ధులైన ఇల్లాండ్రు
30. ఆత్మహత్యలు
31. మూఢనమ్మకాలు
32. మోసాలు –పూనకాలు
33. అమావాస్య బిగుదినము
34. రామనామ మహిమ
35. శ్రీరామ చంద్రునకు ప్రియమైనవాడా!
36. రామశబ్ద రహితమైన మాల
37. స్వామినిజరూపమును వీక్షింప కోరుట
38. ఈనాటి పంటలు –రోగాలు
39. ముక్తికి మార్గదర్శి
40. మారుతి–మార్జాల రూపము
41. కన్నీటితో –అభిషేకము
42. కుటింబీకులు –ద్రవ్యదాహము
43. గుండెలో కొలువైన కోదండపాణి
44. అపనమ్మకము తొలగి పోవుట
45. తీర్థ క్షేత్రాల మహిమ
46. సర్వము సమర్పించుట
47. మూర్ఖపు మనస్తత్వము
48. భాషానిలయము భ్రష్టుపట్టి పోవుట
49. రాజకీయనాయకులు పార్టీలు మారడం
50. యుజన సంఘాలు
51. కులసంఘాలు



# దాసుని తప్పులు దండముతో సరి...

"శ్రీప్రసన్నాంజేయ! మాచిత్తవీధి
దనరి 'దాసుని తప్పులు దండుమునను
సరి' యనెడు రీతి రామదాసా! కపీశ!
కాచుకొన రమ్ము నీ భక్త కవుల మమ్ము"

కవి జీవితమున తటస్థపడిన సంఘటనలు కవితల కెక్కడం సామాన్యమే! కాని కవితల కెక్కిన తరువాత అవి పరతత్త్వాని కంకితం కావటం మాత్రం సామాన్యమేమీ కాదు. ఎందుకంటే అది ఆస్తికతతో, అంతర్మథనంతో అనవరతము దైవ విశ్వాసంతో మాత్రమే సాధ్యమయ్యేది. ఆ గుణాలు పురాకృత పుణ్యవిశేషం చేత గాని సిద్ధించవు.

చి|| గోవర్ధన్ కవియైనాడు అంతేకాదు భక్త కవియైనాడు. తన కవితను భగవదంకితం గావించినాడు. అంటే జీవిత సార్థకతకై చేసే ప్రయాణంలో ఒక మలుపు తిరిగినాడన్నది నిర్వివాదం.

భక్తి వరించింది అంటేనే బ్రదుకు తరించింది అని అర్థం. మామూలు కవి కవితలోని గుణదోష విమర్శ చేయడం మామూలే ! కాని భక్తి కవితలో మాత్రం అటువంటి విమర్శకు తావే లేదు, ఎందుకనగా అతడు మానవుల నుద్దేశించి చెప్పనేలేదు, దైవాన్నుద్దేశించి కవిత చెప్పాడు కదా !

ఉదాహరణకు ప్రస్తుత కృతిలో –
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ !

అంటూ గోవర్ధన్ ఆంజనేయస్వామికి యిందలి విషయాలన్ని అప్పచెప్పుతున్నాడు ఆస్వామి వింటున్నాడు, అంటే చెప్పేవాడు చెబుతున్నాడు – వినేవాడు వింటున్నాడు–నడుమ నీకూ నాకూ అభ్యంతర మేమిటి ఇది దోషము ఇది గుణము అని. అవి మన పరిధిలోనివా! ఆలో చింతురు గాక !

ఇది పాలెం గ్రామ వాసి యువభక్త కవి చి||గోవిందు గోవర్ధన్ రచించిన శ్రీపుసన్నాంజనేయ శతకము ఇందులో కొన్ని లోకరీతులు కొన్ని హనుమత్ ప్రార్థనలు కథాత్మకములు వున్నవి. అటనట కొన్ని స్వానుభవాలూను.

ఏదెట్లున్నా యువత పోకడలు, కపట స్నేహితులు, స్వార్థ రాజకీయాలు, ఉగ్రవాదము, రైతులు, మోసాలు, మొదలైన లోకరీతుల లేదా సంఘ విపరీతాల గురించి ఏ యువకవి యైనా చెప్పవచ్చు. (కాకపోతే చి||గోవర్ధన్ కుండబద్దలు కొట్టినట్టు చెప్పటం విశేషం)

కాని స్వామి లీలలు, స్వామి విగ్రహ ప్రతిష్ఠ, శ్రీరాముని అంగులీయము, రామనామ మహిమ, మారుతి మార్జాల రూపము, మొదలైన అంశాలను ఒక భక్త కవి మాత్రమే వ్రాయగలడు.

ఇక కన్నీటితో అభిషేకము, కుటుంబీకులు, ద్రవ్యదాహము, దురాలోచనపరులు, గృహహింస, వైవాహిక బంధాలు విచ్ఛిన్నమగుట, చట్టాలు కొందరి చేతిలో ఆయుధాలు, అక్రమ వరకట్నము కేసులు, అపురూప దాంపత్యము కొరకై శోధించుట, దుర్బుద్ధులైన ఇల్లాండ్రు మొదలైన శీర్షికలు గల పద్యాలతో స్వీయ జీవితంలోని విధి వైపరీత్యాలకు అతలాకుతలమై గాయపడిన కవి హృదయం వద్దన్నా కనిపిస్తూనే ఉంది. పోతే గురుశిష్య సంబంధము, సజ్జన సాంగత్యము, మిత భాషణము, స్థిత ప్రజ్ఞత, వేదాంత రహస్యము, ప్రత్యక్ష దైవాలు, నిరాడంబరత మొదలైన శీర్షికలు గల పద్యాలలో మనుజుడు పాటించవలసిన సమాజ ధర్మాలు, నడుచుకొనవలసిన రీతులు తెలుపబడినవి.

తక్కినవి రామాయణ కథ, హనుమత్కథా సంబంధములు. ఒకటి రెండు పద్యాలలోని విశేషాంశాలనైనా పేర్కొనకపోవడం సముచితం కాదు.

లంకాదహనానంతరం ఆ పట్టణం స్మశాన వాటికగా తయారయింది. పిల్ల పాపలు దహనమైనారు. చూచి రమ్మంటే కాల్చి వచ్చినా డన్న లోకోక్తి కాలవాలమైన తన ప్రవర్తనను పునర్విమర్శ చేసుకున్నాడు. పవనసుతుడు ఏ సీత దర్శనం కోసం తానింత శ్రమ తీసుకున్నాడో ఆ సీత తాను కల్పించిన మంటల కాహుతి కాలేదు గదా అన్న అనుమానం రేకెత్తింది. అతనికెంతో బాధ కలిగింది. 'విజ్ఞులు క్షణము నావేశము నొందిన కుదురైన కార్యముల్ కూల్చబడవె'! హనుమంతుని పశ్చాత్తాపం 86వ పద్యంలో సముచితంగా చిత్రీకరింపబడింది. 46 కవి సర్వ సమర్పణ భావం ప్రతిబింబించిన పద్యం. ఆధ్యాత్మికోన్నతి కిది తగినది. ఇది తుది అర్హత.

నీ మందిరము జేరి నీ రూపు దర్శించి
నీ నామము మదిని నిలుపుదు నయ!
నీ గానమే చేతు నీగాథలే విందు
కడదాక నన్నేలు కరుణతోడ..

అని వేడుకుంటాడు ఒక సాధకుడు ఎందుకంటే

"సారహీనమునైన సంసార జలధిని
దాటతరము గాదు దారి చూపు
అతి భయంకరమైన యపరిమితంబైన
యాశలు చీల్చి చెండాడునెపుడు"

అని విసిగి వేసారి తన అశక్తత తెలిసిరాగా..

'జన్మ జన్మల బంధము చాలునయ్య!
కొట్టు మిట్టాడుచున్నాను పట్టువిడక..." అని

చేతులెత్తేస్తాడు. ఆ తరుణంలో సాధకునిలో దాగిఉన్న ఆత్మ విమర్శ తొంగి చూచింది. పశ్చాత్తాపం పొంగి వచ్చింది. తన పొరపాటేదో తనకు తెలియవచ్చింది. హనుమంతునంతటి వానికే తప్పలేదు కదా ఈ పశ్చాత్తాపం. తక్షణమే 'మూర్ఖపు మనస్తత్వము' అనే పద్యం (47)లో కవి ఇలా తన గురించి వ్రాసుకున్నాడు.

"అల్పబుద్ధిని గల్గి యాలోచనలు లేక
గర్వాంధకారాన కదలుచుంటి
జ్ఞానుల బోధ నజ్ఞానినై మెలగుచు
చెవిని వేయక యుంటి చెడితి నయ్య!
స్వైర విహారినై సరదాగ గడుపుచు
నీధ్యాస మరచితి నెరుకలేక"

అంటూ స్వామికి నమస్కరించినాడు. "ప్రస్తుతించెద పాలెము భక్త వరద! అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ" అని ప్రార్థించినాడు.

'దాసుని తప్పులు దండముతో సరి' అని కదా! లోకోక్తి. నిజమైన పశ్చాత్తాపమైతే ఆ రామదాసు అభయం సాధకునికి తప్పక లభిస్తుంది. నా యన్నది లేకుండా త్రికరణ శుద్ధిగా సర్వం సమర్పించుకున్న వానికి అభయమీయక పోతే స్వామి మరెవరి కిస్తాడు? అటువంటి ప్రియభక్తునికి ఆర్తి తీర్చకపోతే మరెవనికి తీరుస్తాడు?

చి॥ గోవిందు గోవర్ధన్ కలం అతని ఆధ్యాత్మికోన్నతికై మార్గదర్శనం చేస్తూ సాగిపోవాలని, ఆ యువకవి కలం నుండి మరిన్ని భక్తి కృతులు రూపు దిద్దుకోవాలని, 'నష్టోమోహః స్మృతిర్లబ్ధా' అనే స్థితి ప్రసన్నాంజనేయుని అపారమైన కరుణ చేత అతనికి ప్రాప్తించాలని, ఆయురారోగ్య భాగ్యాలు వరించాలని, తరించాలని మనస్ఫూర్తిగా ఆకాంక్షిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

ఇహము సవరించి పరమున కెక్కుకొరకు
నర్హతను ప్రసాదింపుమా! ఆంజనేయ!
భక్త వరద! గోవిందు గోవర్ధనునకు
నార్తి తొలగించుమా! ప్రసన్నాంజనేయ!

శుభంభూయాత్

హనుమదానందస్మరణతో..

**డా॥ వెలుదండ సత్యనారాయణ**
పరమార్థకవి
విజయపురి కాలనీ, హైదరాబాద్
సెల్: 9441162863



# శ్రీ హనుమాన్ అనుగ్రహ ప్రాప్తిరస్తు

మిత్రుడు గోవర్ధన్ రచించిన ఈ ప్రసన్నాంజనేయ శతకం బహుధా ప్రశంసనీయం పద్య కవిత్వం వ్రాయు నేటి కవులరుదు. భక్తి భావ బంధురముగా వ్రాయు కలింకనూ అరుదు. మధురాతి మధురమైన సంగీతమును జోడించి శ్రవణ సుభగముగ వ్రాయు వారు మరింత అరుదు. ఇంతటి మహాత్కార్యాన్ని సాక్షాత్తు ఆంజనేయుడే గోవర్ధనుడి చేత చేయించి ఉంటాడు. కాకున్నా ఇది ఎలా సాధ్యమగును. ఈ కవికి మరొక లక్షణమున్నది. అది అతివేగంగా పద్యాన్ని చెప్పడం. వాయు వేగంతో వాయునందని కథలు చెప్పిన ధన్యజీవి ఇతడు.

సీసమునెన్నుకోవడంలో ఒక ప్రత్యేకత ఉంది. ఒక పద్యంలో కొంచెం ఎక్కువ విషయాన్ని వెలిబుచ్చె అవకాశం ఉండటంతో పాటు ఒక ఊగు, ఒక తూగు, ఒక లయ విన్యాసమునకు అవకాశం ఎక్కువ.

ఇంకను ఈ కవి ప్రత్యేకత ఏమిటంటే సంస్కృతంలో యతి ఉంటే – ఆ స్థానం నుండి పదము ప్రారంభమవుతుంది.దానికి ముందున్నది వేరే పదమై ఉంటుంది. ఈ విషయం తెలుగులో లేనప్పటికీ దాదాపు ఈ శతకములో ఆద్యంతము ఈ విషయాన్ని పాటించడం చూస్తే సంభ్రమాశ్చర్యాలు కలుగుతాయి. దీని వలన సీసాలు మరింత గానయోగ్యమయ్యాయి. ఇది ఈ శతకము యొక్క ఉత్కృష్టతను చాటే లక్షణం.

గోవర్ధన్ నాకు కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ఎం.ఎ. తెలుగు చదువుకునే రోజుల నుండి మంచి పరిచయం. మృదు స్వభావి నిరంతర తత్వ చింతనాపరుడు. అతనికి నేను మిత్రుడిని కావడం నా అదృష్టం. ఈ శతకంలోని ప్రతి పద్యమును వాట్సాప్‌లో పంపేవారు. నేను చదివి చాలా ఆనందించేవాడిని. ఎందుకంటే నాకు కవులంటే గౌరవం. భక్త కవులంటే ఆరాధన భావం. పోతన గారి నుండి నేటి భక్త కవుల వరకు నాకలాంటి భావమే ఉంది.

**గోవిందు గోవర్ధన్**

శిష్ట రక్షణ, దుష్ట శిక్షణ, ధర్మసంస్థాపన అనే ముప్పురిగొన్న సూత్రానికి కట్టుబడిన శ్రీ రామావతార కథలో కీలక పాత్ర నిర్వహించిన వాడు. హనుమంతుని జీవితంలోని కొన్ని ముఖ్యమైన ఘట్టాలు చెప్తూ చాలా సుందరంగా ఈ శతకం వ్రాయబడింది.

భక్తి భావ బంధురంగా వ్రాయడంలో పోతనను, మేడిపండు లాంటి సమాజాన్ని పొట్టవిప్పి చూపించే విషయంలో వేమనను తలపింపజేశారు ఈ కవి.

ప్రతి పద్యానికి ఒక శీర్షకనివ్వడం వీరి ప్రత్యేకత. ఇంతకుముందు వ్రాసిన శతకంలో కూడా ఇలాగే ఇవ్వడం జరిగింది. దీని వలన పాఠకులు సుభలంగా విషయం గ్రహించే అవకాశం ఉంది.

మూర్తీభవించిన శివకేశవులే ఆంజనేయుడు. అతని అనుగ్రహాన్ని పొందిన గోవర్ధనుడు ధన్యుడు. ఈశతకం చదివిన మా బోటివారు ధన్యులు.

సీ॥ భారతి నీనోట పలికించె తేనెలు
నీజన్మ సార్థక మెంచి చూడ
వాయువేగంబున వాయు పుత్రుని కథల్
పరవళ్ళు త్రొక్కెను పరవశాన
అంజలి ఘటియించి ఆంజనేయుని గూర్చి
మంజుల పదముల పలికినావు
సంగీత సాహిత్య సమ్మేళనంబుగా
సీసాలు వ్రాశావు చిత్రముగను

తే॥ మేడిపండు సమాజపు మెరుపులన్ని
విప్పిచూపించినావు కన్విప్పుగలుగ
ఆశుకవివీవు గోవర్ధనా! శుభంబు
మించి శ్రీరామ దూత దీవించు నిన్ను

**డా॥ జి.శ్రీనివాసరావు**
సహాయ ఆచార్యులు, తెలుగు విభాగము
ప్రభుత్వ డిగ్రీ కళాశాల, పటాన్‌చెరు



# సమకాలీనతను విస్మరించని శ్రీ ప్రసన్నాంజనేయ శతకం

శ్రీరామ నామం పలికినా, రాసినా పుణ్యమొస్తోందనేది మన భారతీయులకున్న ఒక విశ్వాసం. శ్రీరాముణ్ణి అత్యంత భక్తి శ్రద్ధలతో సంపూర్ణ విశ్వాసంతో కొలిచిన వాడు శ్రీ ఆంజనేయుడు. సాధారణంగా సీతారాముల చిత్రపటంలో ఎల్లప్పుడు లక్ష్మణుడితో పాటు శ్రీ ఆంజనేయుడు కూడా కలిసి ఉండటం ఒక విశేషం. ఇటీవల కాలంలో శ్రీరాముడి భక్తుడైన శ్రీ ఆంజనేయుడు వార్తల్లోకి వచ్చాడు. ఆయన కులాన్ని దాన్ని ధ్రువీకరించే పత్రాలను జారీ చేయమనే వరకు ఆ దుమారం చెలరేగింది. ఈ పరిస్థితుల్లో శ్రీ ఆంజనేయుని భక్తిని ప్రశంసిస్తూ ప్రముఖ పద్యకవి గోవిందుని గోవర్ధన్ "శ్రీ ప్రసన్నాంజనేయ శతకం" రావడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. మిత్రుడు గోవర్ధన్ మంచి భక్తుడు. స్థానిక దేవాలయాలు, వాటిని పోషించేవారినీ మర్చిపోకూడదనే సహృదయ స్వభావం గలవాడు. ఈ యేడాది దసరా సెలవుల్లో ఏం చేస్తున్నారన్నప్పుడు ఈ శతకం రాస్తున్నానని కేవలం వారం రోజుల్లో ఈ శతకాన్ని మన ముందుకు తెచ్చాడు. ఈ శతకాన్ని రాస్తున్నన్ని రోజులు గోవర్ధన్ నిరంతరం శ్రీరాముడు, సీతాదేవి, లక్ష్మణుడు, శ్రీ ఆంజనేయుడు వారి మహాత్మ్యాల్ని స్మరించుకుంటూ వర్ణించుకుంటునే గడిపిన రోజుల్ని నేనెన్నో గమనించాను. ఆయన రాసిన పద్యాలను వాట్సాప్‌లో ఎప్పటికప్పుడు పంపించి వాటిని తాజాగా చదివే అవకాశాన్ని, అదృష్టాన్ని కలిగించాడు. ఆ పద్యాల్లో ఒక ప్రవాహంలో పదాలు ఉరికి పడుతున్నట్లు, ఒక క్రమంతో తమ భక్తి పారవశ్యం తొణికిసలాడినట్లు అనిపించింది. నిజంగానే ఆ స్వాములు ఆయన చేత ఈ శతకాన్ని రాయిస్తున్నారేమోనని కూడా అనిపించింది. ఎప్పుడు చదివినా పద్యానికి సంబంధించిన విశేషాల్ని అప్పుడే నాకు తోచిన అంశాల్ని మిత్రుడితో పంచుకునేవాడిని. నాకు మాత్రమే కాకుండ ఈ పద్యాల్ని ప్రముఖ పద్య కవులు, చందస్సులో పండితులైన డాక్టర్ వెలుదండ సత్యనారాయణ గారికి పంపించి సలహాల్ని, సూచనల్ని పొందే వాడినని చెప్పేవాడు. "పండిత కవినాడు పద్య గురువు యైన వెలుదండ వారిని వేడుకొంటి మారుతిరాయుని మకుటము నిలుపను సూచననందించే చూడుమనుచు" అని తాను ఈ శతకం రాయడంలోను, మకుటాన్ని నిర్ణయించుకోవడం లోనూ డాక్టర్ వెలుదండ సత్యనారాయణ గారి సహాయం తీసుకున్నానని సవినయంగా కూడా చెప్పుకున్నాడు కవి. వీరితోపాటు మరికొందరి ప్రోత్సాహం కూడా విస్మరించకుండ శతకంలో

స్మరించుకున్నాడు కవి. నిజానికిది కావ్యంలో అవతారిక స్వభావాన్ని సంతరించుకున్న శతకంగా వర్ణించాడు కవి.

"అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ" మకుటముతో కొనసాగిన ఈ శతకం కేవలం భక్తి శతకం మాత్రమే కాదు సమకాలిన సమస్యల్ని ప్రస్తావిస్తూ వాటిని పరిష్కరించుకోవడానికి ఉత్తమ సంస్కారాన్ని ప్రసాదించమని కోరడం వల్ల ఈ శకతం ప్రత్యక్షంగా సామాజిక ప్రయోజనాన్ని ఆకాంక్షిస్తుంది.

1. మిత్రుడెప్పుడు మారునో శత్రువునిగ తెలియరాకున్నదీనాడు తేటముగను ప్రస్తుతించెద పాలెము భక్త వరద అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ అని ఒక పద్యంలో కపట స్నేహితుల గురించి ఆవేదన చెందుతాడు కవి. దీనిలో స్వార్థ రాజకీయాల్ని తూర్పారబడుతూ డబ్బు సంపాదించడానికే పాలనా పగ్గాలు చేపడుతున్నారు తప్పా ప్రజా శ్రేయస్సు పట్టించుకోవడం లేదని అటువంటి వాళ్లను ప్రజా ప్రతినిధులుగా పొరపాటున ఎన్నుకున్నా వాళ్లను చైతన్యవంతమైన ప్రజలు గుర్తించి త్వరలోనే మరలా వాళ్ల అధికారాన్ని తొలగిస్తారని ఆకాంక్షను వ్యక్తం చేస్తాడు కవి. అలా ప్రజలు మంచి నాయకుల్ని ఎన్నుకోవడానికి ధైర్యాన్ని ఇవ్వమనడం భక్తిని ఆధునిక భావాలకు ముడిపెట్టి నిష్కలంకమైన పని కూడా నిజమైన ధైర్యాన్ని ఇస్తుందని పాఠకుల్లో నవ్యోత్సాహాన్ని నింపుతున్నాడు కవి.

2. రైతులు వివిధ పంటలు పండించి వాటిని మార్కెట్లో అమ్ముకునే సమయానికి దళారులు ప్రవేశించి తగిన ధరలు లేకుండా చేస్తుంటారు. దీన్ని పాలకులు అడ్డుకోవాల్సింది పోయి వాళ్లకు అండగా ఉండటాన్ని గమనించిన కవి "యేలు ప్రభువులు మిలితమై ఇష్టముగను రైతు పొట్టకొట్టుచునుంద్రు" అని ధైర్యంగా వర్ణించగలిగాడు కవి.

3. ఉద్యోగాలు లేక కొంతమంది వాటికోసం ఎంతోమంది నిరీక్షిస్తుంటే ఉద్యోగాలు పొందిన వాళ్లు ఆ విధుల్ని నిర్లక్ష్యంగా నిర్వర్తిస్తున్నవాళ్లనూ వదల్లేదు. ఉద్యోగాలు చేసే వాళ్లు తమకు సకల సౌకర్యాలు అందుబాటులో ఉంటే పట్టణాలు, నగరాల్లో పని చేయడానికి ఆసక్తి చూపిస్తుంటారు. నిజానికి అన్నీ అందుబాటులో ఉన్నట్లు అనిపించినా ఇళ్ళ అద్దె, పనిమనిషి, ప్రయాణం.. ఇలా అన్నీ ఖరీదే. కానీ ఖర్చు పెట్టిన అందుబాటులో లేని పరిస్థితి పల్లెటూరిది. ఇప్పుడు ఇన్వర్టర్స్ వచ్చిన తర్వాత కరెంట్ సమస్య పెద్దగా లేకపోయినా సరైన వైద్యం అందుబాటులో ఉండదు. కొన్ని సార్లు డబ్బులున్నా పాలు, గ్యాస్, కూరగాయలు వంటి కనీస అవసరాలు కూడా లేని ఊళ్ళు ఎన్నో ఉన్నాయి. అందువల్ల ఉద్యోగులు కనీసం మున్సిపాలిటి స్థాయి పొందిన పట్టణాలకు బదిలీలపై వెళ్లిపోతుంటారు. అందువల్ల పల్లెటూళ్లలో చదువుకునే వాళ్ల పరిస్థితి చాలా దుర్భరంగా తయారవుతుంది. ఒక వేళ

పల్లెటూళ్లలో పాఠాలు చెబుతున్నా వాళ్లు పట్టణాల నుండి వస్తుంటారు. ఈ పరిస్థితిని గమనించిన కవి కదిలిపోతూ...

4. "పల్లె విద్యాలయాల్ పలుచనైపోయెను పంతుళ్ళ కొరతతో భ్రష్టుపట్టె" నని ఆవేదన పడుతూ శ్రీ ఆంజనేయునకు విన్నవించుకుంటాడు కవి. పల్లెటూళ్లలో పని చేసే వైద్యులకు ఉన్నత చదువులు చదువుకోవడంలోనూ, ఇతర అవకాశాల్లోను రిజర్వేషన్లు ఇస్తున్నారు. అలాగే ఉపాధ్యాయులకు కూడా పల్లెటూళ్లలో పని చేసే వాళ్లకు హెచ్ఆర్ఏ ఎక్కువగాను, పట్టణాలు, నగరాల్లో పని చేసే వారికి తక్కువగా నిర్ణయిస్తే కొంత మార్పు రావచ్చునేమో. తాను ప్రత్యక్షంగా బోధనా రంగంలో ఉండటం వల్ల తాను గమనించిన అవకతవకల్ని అనేక కోణాల్లో వర్ణించాడు కవి.

5. నేడు ఆంగ్లమాధ్యమం పేరుతో జరుగుతున్న విద్యాబోధన పల్లెటూళ్లలో మొదటికే మోసాన్ని తెచ్చి పెడుతుంది. కేవలం తమ మాతృభాషలోనే చదివించుకోలేని పేదవాళ్లు ఆంగ్లమాధ్యమంలో చదివించడం ఎంత వరకు సాధ్యం? మాతృభాషతో పాటు ఆంగ్లం కూడా ఉండాలి. మనకీ త్రిభాషాసూత్రం ఉండనే ఉంది. దాన్ని ప్రతిష్టంగా అమలు చేస్తే సత్ఫలితాల్ని సాధించవచ్చు. కానీ వెర్రిగా అక్షరాలు నేర్చుకునే వయసు నుండే ఆంగ్ల భాష, ఆంగ్ల మాధ్యమాలు అంటూ చేసే వితండ వాదనలు సమాజానికి ఎలాంటి పరిణామాలను తీసుకువస్తాయో ఆలోచించాల్సిందే. ఇలా అనేక అంశాల పట్ల కవి స్పందించాడు. ప్రభుత్వాధికారులు పరోక్షంగా వీటిని విన్నపాలుగా గ్రహించి సంస్కరణలు చేపడితే బాగుంటుంది.

6. కవి గోవిందుని గోవర్ధన్ గారు నాగర్‌కర్నూల్‌లోని శ్రీలక్ష్మీనృసింహస్వామి ఆశీస్సులతో ముక్తి కోసం శ్రీప్రసన్నాంజనేయ శతకం రాసినట్లు తెలుస్తుంది. అయితే పల్లె పాలెములో విగ్రహ ప్రతిష్ట గురించి ఒక చక్కని పద్యాన్ని వర్ణిస్తూ

7. "కంటికి రెప్పలా కాపాడు ప్రభువని నిష్టతో మిమ్ము ప్రతిష్ట చేసి ప్రత్యేక శ్రద్ధతో నిత్యము పూజించి వేడ్కలు జరిపిరి విశ్వసించి. ఆశిస్సులను పొంది ఆనందనిలయాన కొనసాగుచుండిరి కొరత లేక" అని ఆ ఊరికి రక్షకుడిగా భావిస్తున్న స్థితిని తెలియజేశాడు కవి. ఇది ప్రసన్నాంజనేయ శతకం అయినప్పటికీ ప్రతి పద్యంలోను సమ కాలిన సమాజం దర్పణంలోకనిపిస్తుంది. ప్రతి పద్యం కంఠస్థం పట్టాలనిపిస్తుంది. ఒక సారి ఒక పరిశోధనా పత్రికకు వ్యాసం రాయమని గోవర్ధన్‌ను అడిగితే "నేను వ్యాసం రాయలేను పద్యం తప్ప" అన్నారు. నిజానికి వ్యాసం రాయలేక కాదు పద్యం పట్ల తనకున్న ప్రేమ అటువంటిది. అలాంటి ప్రేమతో, అలాంటి ఇష్టంతో సమాజంలో జరుగుతున్న అనేక విషయాల్ని చూస్తూ ఉండలేక పద్యాల్లో ఆ సమస్యల్ని దైవానికి విన్నవిస్తున్నాడు కవి. ప్రపంచీకరణను మనం

వద్దన్నా మన ఇంటిలో దాని ప్రభావం కనిపిస్తుంది. అది కేవలం వస్తు వ్యామోహంగా కాదు. కుటుంబ విచ్ఛిన్నంలో కనిపిస్తుంది. ఉమ్మడి కుటుంబాలు నేడు వ్యష్టి కుటుంబాలు అయిపోయాయి. నూటికో, కోటికో ఒక్క ఉమ్మడి ఉమ్మడి కుటుంబం ఉంటుందేమో. చదువుల కోసమో, ఉద్యోగం కోసమో, వ్యాపారం కోసమో సొంత ఊరు, సొంత ఇంటిని వదిలి వెళ్లక తప్పని పరిస్థితి నెలకొంది. "స్వేచ్ఛ" విచ్చలవిడి తనానికి దారి తీస్తుంది. నేడు కొన్ని ఉద్యోగాలు చేసే వాళ్లు "సహజీవనాలు" చేస్తున్నారు. ఒకప్పుడు పాశ్చత్య దేశాల్లో డేటింగ్, సహజీవనం వంటి వాటి గురించి విన్నప్పుడు ఆశ్చర్యానికి లోనయ్యేవారు. నేడు వాటిని సహజంగా భావించే స్థితికి వచ్చేస్తున్నారు. అందువల్ల స్త్రీపురుష సంబంధాల్లో శాశ్వతత్వం అనేది క్రమేపీ కనుమరుగైపోతుంది. దీని పట్ల కవి తీవ్రంగా కలత చెందుతాడు.

8. వసుధపై నీనాడు వైవాహ బంధాలు సాగకున్నవి కొన్ని శాశ్వతముగను అనడం వెనుక కవి సమకాలీన ప్రపంచీకరణ యుగంలో స్త్రీపురుష సంబంధాల్ని మనముందుంచడమే.

ఉమ్మడి కుటుంబం విచ్ఛిన్నం కావడం వల్ల వచ్చిన దుష్పరిణామాల వల్ల అనేక మంది వృద్ధాశ్రమాల్లో తలదాచుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. సామాజిక సంబంధాలు, ఆర్థిక సంబంధాలుగా మారిన తర్వాత విలువలనేవి ప్రశ్నార్థకమవుతాయి. అమ్మాయి చదువుకున్నా కట్నం, ఆస్తి పాస్తుల వాటాలు ఇవ్వనిదే వివాహాలు అయ్యే పరిస్థితులు కూడా ఎక్కువయ్యాయి. వాటి వల్ల క్రమేపీ ఒంటరితనం, ఆత్మహత్యలకు దారి తీస్తున్న పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఈ విషయాల పట్ల కూడ కవి స్పందించాడు.

ఇలా సమకాలీన సమాజంలో మనచుట్టు జరుగుతున్న అనేక సమస్యల్ని శ్రీ ప్రసన్నాంజనేయునికి నివేదించి వాటిని సక్రమ మార్గంలో పెట్టాలని వాంచించడమనేది సమాజ కల్యాణాన్ని ఆకాంక్షించడమే. పద్యాన్ని సులభంగా సరళంగా అర్థమయ్యే శైలిలో రాయడం ఎలాగో ఈశకతం చదివితే ఒక చక్కని అవగాహన కలుగుతుంది. ఈయన రాసే పద్యాల్లో చక్కనిధార ఉంటుంది. చక్కని భావం ఉంటుంది. మరిన్ని పద్యాలతో శతకాలు, కావ్యాలు వర్ణించి తెలుగు సాహిత్య చరిత్రలో తనదైన ప్రత్యేక స్థానాన్ని సాధించుకోవాలని కోరుతూ మిత్రుడు గోవిందుని గోవర్ధన్‌కి ఈ సందర్భంగా శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను.

**ఆచార్య దార్ల వెంకటేశ్వరరావు**
తెలుగు శాఖ, అండ్ డిప్యూటీ డీన్
స్టూడెంట్స్ వెల్ఫేర్, సెంట్రల్ యూనివర్సిటీ
హైదరాబాద్ – 500046.



# అభినందనలు

గోవిందు గోవర్ధన్ వ్రాసిన "శ్రీ ప్రసన్నాంజనేయ" శతకము స్వామి వారి ప్రార్థనతో మొదలై అనేక సమకాలిన సమస్యలను స్పృశిస్తూ చివరకు ఫలశృతి పద్యంతో ముగుస్తుంది.

పద్యాలను వ్రాయడంలో దిట్ట మన గోవర్ధన్. శ్రీకృష్ణుడు గోవర్ధనగిరి పర్వతాన్ని అవలీలగా ఎత్తినట్లు మన గోవర్ధన్ సీస పద్యాలతో అవలీలగా శతకములో ఆడుకొన్నాడు. ఇది కొందరికే సాధ్యము. మొదటి నుండియు గోవర్ధన్ ధార్మిక మనస్తత్వము కలిగిన వ్యక్తి. సౌశీల్యుడు, వినయ సంపన్నుడు.

పద్యాన్ని అవలీలగా చెప్పినట్లే తన మధుర కంఠంతో ఆలపిస్తుంటే ఎంతో హాయిగా ఉంటుంది. శతక నేపథ్యానికొస్తే 2013లో పాలెం శ్రీ ప్రసన్నాంజనేయస్వామి వారి ఆలయంలో (వ్యవసాయ క్షేత్రము చెంత) చైతన్య కల్చరల్ క్లబ్ ఆధ్వర్యంలో యుగాది కవిసమ్మేళనము ఏర్పాటు చేశాము. ప్రతి సంవత్సరం కవి సమ్మేళనము ఏర్పాటు చేయడమన్నది గత 20 సంవత్సరాలుగా వస్తున్న ఆనవాయితీ. ఆనాటి కవి సమ్మేళనములో గోవర్ధన్ ప్రసన్నాంజనేయ స్వామిని గూర్చి స్తుతిస్తూ ఓనాలుగు పద్యాలు వ్రాసి వినిపించాడు. ఆ సందర్భంలో నేను చిరంజీవి గోవర్ధన్‌తో నాన్నా స్వామివారి మీద శతకము వ్రాయడానికి ప్రయత్నించు అన్నాను. "అంతశక్తి నాకెక్కడిది సార్" అంటూ నవ్వాడు. స్వామివారి కృప ఉంటే ఇది సిద్ధిస్తుంది అన్నాను.

కాలం గడిచిపోయింది. ఈ మధ్యకాలంలో నాతో చరవాణిలో మాట్లాడుతూ సార్ నేను స్వామివారి మీద శతకము వ్రాయాలనుకున్నాను మకుటం ఏదైతే బాగుంటుందన్నాడు. మకుటాన్ని గూర్చి రెండు, మూడు అనుకున్నాము. చివరకు "అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ" అనే మగుటముతో శతక రచనకు పూనుకొని కేవలం 20 దినములలోనే శతకాన్ని పూర్తిచేశాడు.

శతకము పూర్తి అయిన వెంటనే మొదటి సారిగా శ్రీ స్వామివారి ఆలయంలో స్వామివారి ముందు పెద్దలు, ఎ.పి.టి విద్యార్థుల సమక్షంలో మచ్చుకు ఐదు పద్యాలు వినిపించడం జరిగింది. ఇది ఈ శతక నేపథ్యము.

ఇక శతక విషయానికొస్తే ఇందులో నమకము, చమకము రెండు ఉన్నాయి. నమకము అంటే స్వామివారి ప్రార్థన. చమకము అంటే మన కోర్కెలను నివేదించడం. కోర్కెలంటే ఇక్కడ

కవి తన వ్యక్తిగత కోర్కెలను కాకుండా సమాజంలో ఉన్న సమకాలిన సమస్యలు స్వామికి నివేదిస్తూ వాటి పరిష్కారాన్ని స్వామికి వదిలేశాడు. స్వామి లీలలను గూర్చి స్తుతిస్తూ

"పావని సీతను పట్టి బంధించిన
లంకేశ్వరుని ముందు రంకెవేసి
కయ్యానికానాడు కాలుదువ్వితివట
వినిపించిరీభువి విజ్ఞులెల్ల"

ఎంతచక్కటి వర్ణనో చూడండి.

అలాగే యువత పోకడల గూర్చి ఎంతో బాధను వ్యక్తపరచాడు ఈ కవి. ఈ మధ్య కాలంలో ప్రేమ పేరున జరుగుతున్న సంఘటనలకు కవి తపించిపోయారు.

ప్రేమదోమల పేర పిచ్చిగా వర్తించి
జనకులన్ విడనాటి సాహసమున
............దుఃఖసంద్రమునందు త్రోయుటేల ?

"బోధచేయుము యువతకు పొందికగను" అని స్వామివారి మీద పెద్ద బాధ్యతే పెట్టారు

స్వార్థ రాజకీయాలను, ఉగ్రవాదము, వైవాహికబంధాలు, వరకట్న కేసులు, ఉత్తమ దాంపత్య జీవితం వంటి అనేక అంశాలపై స్పందించారు.

శతకము వ్రాయాలన్న తలంపు ఎలా కలిగిందో చెబుతూ
హృదయాన మెదలగా ముదముతో రెండవ
శతకముపూరింప సాగితినయ..... అన్నారు.

ఇక్కడోవిషయము గమనించాలి. రెండో శతకము అని వ్రాసికొన్నారు. గతంలో ఈ కవి శ్రీ పాలెం వేంకటేశ శతకం పేరున ఒక శతకాన్ని వెలువరించడం జరిగింది. ఇందులో కూడా పాలెం ఇతివృత్తంగా శతక రచన చేశారు. ఈ శతకము ఆయనకెంతో పేరు ప్రతిష్టలు తెచ్చాయి. పాలెం శాసన కర్త కీ.శే.సుబ్బయ్య గారి జీవన ప్రస్థానంతో సాగిన శతకము కాబట్టి ఈ శతకం జనంలోకి శరవేగంగా చొచ్చుకుపోయింది.

ఇదే కోవలో రెండవ శతకము కూడా పాలెం "శ్రీ ప్రసన్నాంజేయ" శతకము కాబట్టి భక్తులందరు ఈ శతకానికి కూడా తప్పని సరిగా హారతి పడతారనడంలో సందేహం ఇసుమంతయూ లేదు.

తల్లిదండ్రులను సరిగా పోషించలేని కొడుకులకు చురక పెట్టారు కవి.

"భార్య మాటలు చెవిసోకి భారమనుచు
కదలి వృద్ధాశ్రమాలలో గడుపుమనిరి"

అన్నారు అలా అంటూనే స్వామి ఇలాంటి ఆశ్రమాలకు తల్లిదండ్రులను తరలించే పుత్రులకు కనువిప్పు కలిగించమని కోరినారు.

ఆనాటి ఉమ్మడి కుటుంబ వ్యవస్థను గూర్చి చెబుతూ
ఉమ్మడిగనుండ నోపలేకున్నరిపుడు
అర్థమే పరమార్థమై దుర్దినములు
దాపురించెను వాటిని తరిమివేసి

ఈనాడు ధనమోహము చేత కుటుంబ వ్యవస్థను భ్రష్టుపట్టిస్తున్నారు. ఉమ్మడి కుటుంబంలో పనులెక్కువ, ధనము ఎక్కువ ఖర్చు చేయాల్సి వస్తుంది. ఒంటరి కుటుంబాలు అయితే ఈ రెండింటి నుండి తప్పించుకోవచ్చునన్న స్వార్థపూరితమైన ఆలోచనవల్లే ఈనాడు ఉమ్మడి కుటుంబ వ్యవస్థకు చోటు లేకుండైపోయింది.

"పల్లె పాలెమునందు ప్రముఖుడా సుబ్బయ్య
నిరుపేదవారిపై నెనరుచూపి"

అన్న పద్యము ద్వారా తానింతవాడుగా ఎదగానికి కారణమైన శ్రీ సుబ్బయ్యగారికి, గురువులకు కృతజ్ఞతలు తెలుపుకున్నాడు ఈ కవి. ఇది వారి సహృదయమునకు తార్కానము.

"ఆహ్లాద వాయువులందుచు హాయిగా
కునుకు దీయుదు రిట కోర్కెతోడ"

అన్న పద్యము ద్వారా సుదూర ప్రాంతాల నుండి ముఖ్యంగా కర్నాటక రాష్ట్రం నుండి కాలినడకన శ్రీశైల మల్లికార్జునుని దర్శనానికి వెలుతూ మార్గమధ్యంలో ఈ ప్రసన్నాంజనేయ స్వామి చెంత కొంత సేద తీర్చుకొని అన్నపానాదులు ముగించుకొని తాపీగా తిరిగి తమ ప్రయానాన్ని కొనసాగిస్తుంటారు. దీనికి కారణం ఇక్కడి ప్రశాంత వాతావరణంతో పాటు ఆలయ కమిటీ వారు కల్పించిన సదుపాయాలే కారణంగా భక్తులు వేన్నోళ్ల పొగడుటను కవి తన స్వానుభవాన్ని కన్నులకు కట్టినట్లు వర్ణించారు. మొత్తము మీద 118 పద్యాలలో కవి శతకాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు. ఒక్క మాటలో చెప్పాలంటే చక్కని సీస పద్యాలలో సరళమైన పద కూర్పులో పామరులను కూడా చాలా సులభంగా గ్రహించేలా శతకాన్ని పొందుపర్చారు. గోవిందు గోవర్ధనుని గొప్పతనం ఈ ద్వితీయ శతకములో కూడా రూఢీ అయింది.

నిత్యము స్వామి సేవలో తరించే గోవర్ధన్ శతకము ద్వారా తన భక్తిని స్వామి ముందు ఆవిష్కరించారు.

**గాడి సురేందర్**

విశ్రాంత ఉపాధ్యాయులు

శ్రీ ప్రసన్నాంజేయ ఆలయ అభివృద్ధి కమిటీ సభ్యులు



# ఓం శ్రీ సాయిరామ్

చి॥ గోవిందు గోవర్ధన్ విద్యావినయ సంపన్నుడు. దైవానుగ్రహముచే కవితాశక్తి లభించినవాడు. లోకజ్ఞుడు. భక్తి జ్ఞాన వైరాగ్యాది సుగుణ సంపత్తి కలిగినవాడు.

సాహిత్యమునందలి యితర ప్రక్రియలకంటె శతక ప్రక్రియ యందు కవి యొక్క ఆత్మీయతాముద్ర అధికముగా ప్రకటితమవుతుంది. ఈతని పాలెము వేంకటేశ శతకము పాలెం పునర్నిర్మాతయగు శ్రీ తోటపల్లి సుబ్రహ్మణ్యవర్మ (పాలెం సుబ్బయ్య) గారి జీవితం– ఆయన సాధించిన అనేక ప్రజోపయోగకార్యక్రమములను గురించి తెలిపే రచన కావటంచేత దానిలో కవి ఆత్మీయత అంతగా ప్రకటము కాలేదు. కాని ప్రస్తుత రచనయగు శ్రీ ప్రసన్నాంజేయ శతకము నందు కవియొక్క లోకజ్ఞత, ప్రజల కష్టసుఖములందు హృదయస్పందన, సత్య ప్రకటన విషయమున నిర్భయత్వము, స్వీయ భక్తి జ్ఞాన వైరాగ్యాదులు స్పష్టముగా ప్రతిబింబించుచున్నవి.

ఇక కవితాశక్తి విషయమునకు ఇందలి ధారాశుద్ధి నుడికారపు సొంపు చక్కని నిదర్శనములు. భాషలో, భావములో ఎట్టి క్లిష్టత లేక సరళముగా సాగుటవలన ఈ శతకము సకల జనామోదమును పొందగలదు.

భాషయందు మంచి ప్రావీణ్యము కలదు కనుక ఈ కవి మున్ముందు ఇతర ప్రక్రియలనుకూడా చేపట్టి ఆంధ్ర సరస్వతికి నూతనాలంకాములను సమకూర్చవలెనని ఆశిస్తూ సెలవు తీసికొనుచున్నాను.

**వింజమూరి శేష ఫణిశర్మ**

విశ్రాంత ఆంధ్రోపన్యాసకుడు

ప్రశాంతి నిలయం

26-08-2019



# శుభాశీస్సులు

భక్తికి, నీతికి దర్పణం గోవర్ధన్ గారి శతకం తెలుగులో శతక ప్రక్రియ విశిష్టమైనది. దీని చరిత్ర మహోజ్జ్వలమైనది. శతాబ్దాలుగా వాసి తగ్గకుండా విస్తరిస్తున్న శక్తివంతమైన ప్రక్రియ శతకం. ఆది నుండి ఇప్పటివరకు ఈ శతక ప్రక్రియ సజీవంగా ఉండడమే కాక దినదినాభివృద్ధి చెందుతూ ఉండడానికి కారణం వీటిలో సమాజం ప్రతిబింబించడమే. సామాజిక దృష్టి ఉన్న ప్రతి పద్యకవి శతకాన్ని రచించడం దీని ఔన్నత్యానికి నిదర్శనం.

శతకాలు భక్తికి, రక్తికి, ముక్తికి, సమాజ చైతన్యానికి వేదికలు. నీతిబోధ చేయాలన్నా, సమాజ రుగ్మతలను పేర్కొని సంస్కరణలను ప్రచారం చేయాలన్నా కవులకు శతక రచన ఒక చక్కని వేదిక అవుతున్నది. శతక పద్యాలలోని ముక్తక లక్షణం ఇందుకు అనుకూలంగా ఉండడం ముఖ్య కారణం.

కేవలం శతకాలు మాత్రమే వ్రాసి మహాకవులుగా కీర్తిగడించిన వారున్నారు. దాదాపుగా పద్యకవులు తమ తొలి రచనగా శతకాలను వెలువరించడం మనం గమనించవచ్చు. అంతటి ఆదరణ పొందిన ప్రక్రియ కనుకనే తెలుగులో వెలకొలది శతకాలు వచ్చాయి, వస్తున్నాయి.

సాధారణంగా శతకాలు భాషలోనూ, చందస్సులోనూ సారళ్యత కలిగిఉంటాయి. అవి పండిత పామరులకు అందుబాటులో ఉండాలని చూస్తారు. ప్రౌఢంగా వృత్తాలలో వ్రాసిన శతకాలున్నా సంఖ్యాపరంగా అవి తక్కువే. ఆబాల గోపాలుర నాలుకలపై నర్తనమాడేవి ఎక్కువగా ఆటవెలది, కందం, సీసాలలో వ్రాసిన శతక పద్యాలే.

శ్రీ గోవిందు గోవర్ధన్ – పాలెం ప్రాచ్య కళాశాలలో తెలుగు ఉపన్యాసకులు, భాషా సంపదకు లోటు లేనివారు. వారు సీసపద్యాలతో శతక రచనను సంకల్పించి స్థానిక అంజనేయస్వామిని సంబోధిస్తూ, భక్తి, సామాజికాంశాల కలబోతగా దీనిని పూర్తిచేసారు. “ప్రస్తుతించెద పాలము భక్తవరద ! అభయమొసగుమా శ్రీప్రసన్నాంజనేయ !” అంటూ

ఎత్తుగీతి చివరి రెండు పాదాలను మకుటంగా స్వీకరించారు. ధర్మపురి నారసింహ శతకం, ఆంధ్రనాయక శతకం మొదలైనవాటిలో ఇలా రెండు పాదాల మకుటం ఉండడం సర్వ విదితమే.

సంప్రదాయాన్ని గౌరవించే ఈ కవి గారు శ్రీకారంతో మొదటి పద్యాన్ని ఆరంభించారు. ప్రసన్నాంజనేయస్వామిని స్తుతిస్తూ, ఆయన ప్రాశస్త్యాన్ని వివరిస్తూ కొన్ని పద్యాలు వ్రాసారు. సీతాన్వేషణ, రావణ గర్వభంగం, లంకాదహనం, రాక్షస సంహారం మొదలైన ఎన్నో విషయాలను వివరించారు. నాగర్‌కర్నూల్ లక్ష్మీనృసింహస్వామిని ప్రస్తావించారు. రామనామ మహిమను వర్ణించారు. ఈ పద్యాలు ఒక పార్శ్వం.

మరొక పార్శ్వం సామాజిక చైతన్యాన్ని అభిలషించే పద్యాలు. సమాజంలోని అక్రమాలను, మానవ సంబంధాలను, రాజకీయాలను, సాంఘిక దురాచారాలను విమర్శిస్తూ చక్కని పద్యాలు వ్రాశారు. లోపాలను ఎత్తిచూపడమే కాక పరిష్కార మార్గాలను సూచించడం ప్రశంసనీయం.

పద్యాలు సమర్థ పద ప్రయోగాలతో, చక్కని ధారతో, మనోహరమైన నడకతో ఉత్సాహంగా చదివింపజేస్తాయి. ఎక్కడా గణ యతి ప్రాసల కోసం కక్కుర్తిపడ్డట్టు కనిపించదు. అంత సాఫీగా సాగింది పద్యరచన. భక్తిని, నీతిని కలగలిపి రచించిన ఈ శతకం అన్ని వర్గాల వారిని సంతృప్తిపరుస్తుందనడం అతశయోక్తి కాదు.

గోవర్ధన్ గారికి పద్యకవిగా మంచి భవిష్యత్తు ఉన్నది. వారి కలం నుండి ఇంకా పెక్కు పద్యకృతులు వెలువడాలని ఆకాంక్షిస్తూ నా అభినందనలను, ఆశీస్సులను తెలియజేస్తున్నాను. స్వస్తి !

**కంది శంకరయ్య**

'శంకరాభారణం' బ్లాగు,

వాట్సప్ సమూహ నిర్వాహకుడు

హైదరాబాదు



# సమాజ హితం

నేను పాలెం డిగ్రీ కళాశాలలో భౌతికశాస్త్ర అధ్యాపకుడిగా పనిచేస్తున్న కాలంలో గోవింద్ గోవర్ధన్ విద్యార్థిగా ఉన్నాడు. అతడు పద్య కవిత్వం, అందునా 118 పద్యాలతో శతకం రాయటం సంతోషంగా ఉంది. భౌతిక శాస్త్రాన్ని అధ్యాపనం చేసిన నేను అతడి పద్య రచనలోని మెళకువలను విశ్లేషించలేను. కానీ, ప్రసన్నాంజనేయుని పేరిట రాసిన ఈ శతకంలో సామాజిక, రాజకీయ విషయాలపై గోవర్ధన్ వెలువరించిన అభిప్రాయాలు అవినీతి, అక్రమాలపై ప్రకటించిన ఆగ్రహం లోకంలోని చెడును దునుమాడాలన్న అతడి ఆకాంక్షను వ్యక్తపరుస్తున్నాయి. కేవలం సమస్యను గురించి మాట్లాడి ఊరుకోకుండా పరిష్కారాన్ని కూడా చెప్పే ప్రయత్నం చేయటం అతని సామాజిక చేతనకు అద్దం పడుతున్నది.

"పాడుపంటలు పల్లెలో పరిఢవిల్లె నాటి ముడి ధాన్యములు పొంద చాటుమయ్య" అంటూ పల్లెల్లో ధ్వంసమవుతున్న పాడిపంటల గురించి వేదన వ్యక్తం చేయటం, "కుట్రపరులను తప్పక కూల్చునటుల ప్రజల చైతన్యపరచుము భారమనక" అంటూ ప్రజా చైతన్యం కోసం ప్రార్థించటం, పౌరునిగా గోవర్ధన్ తన సామాజిక బాధ్యతను విస్మరించలేదని స్పష్టం చేస్తున్నాయి.

క్రమశిక్షణకు, భక్తి తత్పరతకు, దృఢసంకల్పానికి, సేవా పరాయణత్వానికి ప్రతీకగా నిలిచిన ఆ ఆంజనేయుని పేరిట గోవర్ధన్ చేసిన శతక పద్య రచనకు మరోసారి అభినందనలు తెలియజేస్తూ, మునుముందు మరెన్నో సామాజిక ప్రయోజన రచనా వ్యాసంగం చేయాలని ఆశిస్తున్నాను.

**డా.పి.బాల భాస్కర్**
అకడమిక్ గైడెన్స్ ఆఫీసర్ (I/C)
ఉన్నత విద్యా శాఖ

# కృతికర్త

'పాలెం వేంకటేశ శతకావిష్కరణ అనంతరం ఇంకేమైనా అంశాన్ని తీసుకొని ఇంకొక శతకమును ప్రారంభించుమని నా పద్య గురువు డా॥వెల్దండ సత్యనారాయణ గారు సూచించారు. పాలెం ప్రసన్నాంజనేయ స్వామి గుడిలో ఉగాది పండుగ సందర్భంగా జరిపిన కవి సమ్మేళనములో పాల్గొని అందులో "ప్రస్తుతించెద పాలెము భక్త వరద అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ" అనే ద్విపాద మకుటముతో 5/6 సీసపద్యాలను వ్రాసియుంటిని. గురువుగారి సూచననుసరించి పాలెం ప్రసన్నాంజనేయ స్వామిని స్మరిస్తూ, కొన్ని స్వామి లీలలగురించి, సమాజపోకడల గురించి ప్రత్యక్షముగా నా దృష్టికి వచ్చిన సంఘటనల గురించి పద్యరూపంలో స్వామికి విన్నవించుకొన్నాను.

ఈ శతకమును ప్రారంభించడానికి ముందు ఆత్మీయ సోదరీమణులైన శ్రీమతి మంజుల (ఫిజిక్స్ లెక్చరర్), శ్రీమతి రాధాకుమారి (ఇంగ్లీషు లెక్చరర్), శ్రీమతి సుష్మ (ఎకానామిక్స్ లెక్చరర్) గారలు శతకము నిర్విఘ్నంగా శీఘ్రమే పూర్తి అయ్యేటట్లుగా మనసారా దీవించినారు. వారి ఆశీర్వచనాలు నన్ను ముందుకు నడిపిస్తూ శతకము ప్రారంభించిన రోజునుండి ప్రతి రోజు 5,6 పద్యాలకంటె ఎక్కువగానే పూరించేవాడిని. వారితోపాటు అనేక విషయాలను నా దృష్టికి తెచ్చి పద్యరూపంపలో పూరించడానికి తోడ్పడిన ఆత్మీయ సోదరుడు కె.గోవర్ధన్ గారు ఎంతో సహకరించారు.

పద్యాలు వ్రాయుచున్న సందర్భములో సూచనలకొరకు, సలహాలకొరకు డా॥శ్రీనివాసరావు, ప్రొ॥దార్ల వెంకటేశ్వరరావు గార్లకు పంపించగా వారు ఏమాత్రం విసుగు చెందకుండ ప్రతి పద్యాన్ని చూచి తగిన సూచనలు, సలహాలను అందిస్తూ నన్ను ప్రోత్సహించినారు. వారి సహకారాన్ని నేను ఎప్పటికీ మరచిపోలేను.

శతకము పూర్తి అయిన తరువాత నా పద్యగురువు శ్రీ వెలుదండ సత్యనారాయణ గారిని సంప్రదించాను. శతకములోని దోషాలనన్నింటిని సరిచేసి అందించారు.

పుట్టపర్తిలోనున్న శ్రీ సత్యసాయి భక్తులు శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారి నుండి ఆశీస్సులు పొందడానికై ఆశ్రయించాను. వారు కూడా ఎంతో ప్రేమతో ఆదరించి, శతకములోని ప్రతీ పద్యములోనున్న పదములన్నింటిని పరిశీలించి, సవరణలు చేసి ఆశీర్వదించారు.

శంకరాభరణం వాట్సప్ గ్రూపు నిర్వాహకులు నిరంతరం పద్య పాదాలను అందిస్తూ ఉత్సాహవంతులతో పూరింపచేస్తూ, సవరణలు చేస్తూ తీరిక లేకున్నప్పటికీ నా కోరికను మన్నించి శతకాన్ని పరిశీలించి చక్కని పీఠిక అందిస్తూ నన్ను ఆశీర్వదించిన శ్రీ కంది శంకరయ్య గారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

నేను పాలెం డిగ్రీ కళాశాలలో చదువుచున్న రోజులలో మాకు భౌతిక శాస్త్రం బోధించిన డా॥ బాలభాస్కర్ గారు తెలంగాణ ఉన్నత విద్యా కమీషనరేట్‌లో విద్యాశాఖ మార్గదర్శిగా విదులు నిర్వర్తిస్తూ తీరిక లేకున్నప్పటికీ నా విన్నపాన్ని సహృదయంతో స్వీకరించి నేను సాహిత్యరంగంలో ఇంకా అభివృద్ధి చెందేటట్లు ఆశీర్వదించారు. వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

పాలెం గ్రామ నివాసి శ్రీ గాడి సురేందర్ గారు నన్ను నిరంతరం ప్రోత్సహిస్తూ శతక రచనకు ఎంతగానో తోడ్పడ్డారు. వీరందరికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన 'సువర్ణ ప్రింటర్స్, హైదరాబాద్' వారికి ధన్యవాదములు.

**- గోవిందు గోవర్ధన్**

# ప్రార్థన

సీ॥ 1 శ్రీరఘు రాముని చింతనామృతమును
కోర్కెతో నిత్యము గ్రోలువాడ!
రోమ రోమమునందు రామ నామము విని
సంతృప్తి చెందిన సాధురూప!
గ్రామ గ్రామములందు ఘనముగా ప్రజలచే
సేవింపబడుచుండు చిద్విలాస
భువనాల నంతట భూతప్రేతము లన్ని
నీ నామమును విని నిలువలేక

తే॥ పారిపోవును నత్యంత దూరముగను
రోగబాధలు తొలగును రూఢిగాను
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ !

# స్వామి లీలలు

సీ॥ 2 దుష్టులన్ శిక్షించి శిష్టులన్ రక్షింప
నవతరించితి వట యవనిపైన
రాకాసి మూకలన్ రణరంగమున ద్రుంచి
ధర్మమున్ కాపాడ తలచితి వట
పావని సీతను పట్టి బంధించిన
లంకేశ్వరుని ముందు రంకె వేసి
కయ్యాని కానాడు కాలు దువ్వితి వట
వినిపించి రీ భువి విజ్ఞులెల్ల
తే॥ కొంగుబంగారమై భక్తకోటికొరకు
నేలపై చిరంజీవివై నిలిచితివట
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

# యువత పోకడలు

సీ॥ 3. యౌవనోదయమున హర్షించి యువజనుల్
తనువు రూపాలకు తన్మయులయి
ప్రేమ దోమల పేర పిచ్చిగా వర్తించి
జనకులన్ విడనాడి సాహసమున
సంసారబంధమై సకుటుంబములనెల్ల
దుఃఖసంద్రమునందు త్రోయుటేల
తల్లిదండ్రులు నెప్డు తమ తనూభవులకు
తగిన సంబంధమ్ము తరచి చూచి

తే॥ శుభమునొనగూర్చెదరపుడు సుఖముకలుగు
బోధ చేయుము యువతకు పొందికగను
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

# అరిషడ్వర్గాలు

సీ॥ 4. కోపతాపములన్ని కుట్ర కుతంత్రాలు
బీజమై హృదిలోన పెరుగుచుండు
ఈర్ష్య లసూయలు నేకమై మనిషిని
క్రుంగదీయుచు నుండు కొంప ముంచు
అభివృద్ధి చెందెడి యనుజన్ములనునైన
నెదుగనీయక నెప్డు మదిని తొలచు
అంతరంగమునందు నరి వర్గ షట్కము
నంత మొందించిన హాయిగలుగు

స్మరణ చేసిన నీనామ మంత్రమెపుడు
తొలగజేయును నత్యంత దూరముగను
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## స్వామి విగ్రహ ప్రతిష్ఠ

సీ|| 5.

పల్లె పాలెమునందు ప్రముఖు లెల్లరు కూడి
వ్యవసాయ కేంద్రాన వైభవముగ
కంటికి రెప్పయై కాపాడు ప్రభు వని
నిష్ఠతో మిమ్ము ప్రతిష్ఠచేసి
ప్రత్యేక శ్రద్ధతో నిత్యము పూజించి
వేడ్కలు జరిపిరి విరివిగాను
ఆశీస్సులను పొంది యానంద నిలయాన
కొనసాగుచుండిరి కొరతలేక

తే||
బాటసారులు నరుదెంచి భక్తులైరి
ముడుపులను గట్టుచున్నారు ముదముతోడ
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## దుష్టశక్తులు

సీ|| 6.
వీరాధివీరుడా!వీక్షించు పురమును
గతములో వెలుగొందె గగనమంత
ఇడుపు దేవర లన్ని యింపుగా గ్రామమున్
భక్షించుచున్నవి భయములేక
మంత్ర తంత్రము లుంచి బంధింప గదిలోన
చూడలేకున్నవా సూక్ష్మరూప!
నరరూప రాక్షసుల్ నమ్మించి ప్రజలను
మోసగించిరి గదా ముచ్చటగను!

తే||
మూర్ఖచిత్తుల తెగటార్చు మోదమలర
పప్పు బెల్లము పానకాల్ పంచి పెడుదు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## నాగర్‌కర్నూల్ లక్ష్మినరసింహస్వామి గుడిని దర్శించుట

సీ॥ 7 మోక్షప్రదాత మా ముందున్న లక్ష్మీనృ
సింహుని నిలయము చేరుకుంటి
శతకమున్ పూరింప సంకల్ప ముంచితి
సద్భక్తురాల్ విని స్వాగతించె
సిందూర ప్రియుని నిశ్చింతగా వర్ణించి
ముక్తి నొందు మనెను భక్తి తోడ
నాగరకందనూల్ నారసింహుని క్షేత్ర
ప్రాశస్త్యమునుగూర్చి పట్టు విడక

తే॥ వచన కావ్యము రచియించి వైభవముగ
స్వామి కృపనొందుమని పల్కె సంతసమున
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
నభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## శింశుపా వృక్షముపై హనుమంతుడు

సీ॥ 8 సిందూర ప్రియ! నీదు శ్రేష్ఠమౌ చరితను
వర్ణింపబూనితి వాక్కు లిమ్ము
సీతమ్మ జాడకై శ్రీలంక నడుగిడి
వీధి వీధుల నన్ని వెరపులేక
జల్లెడ బట్టుచు జాడను గుర్తించి
శింశుపా వృక్షమున్ చేరితివట
అవనీజనసురేంద్రుడాగ్రహోదగ్రుడై
మనసును నొప్పించు మాటల ననె

తే॥ సూక్ష్మరూపాన తిలకించిసుదతి నచట
భయము తొలగజేసిన రామబంటువయ్య
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
నభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

# శ్రీరాముని అంగులీయము

సీ॥ 9 చూపులకందని సూక్ష్మరూపముదాల్చి
పాదపమున నిల్చి భక్తితోడ
రామనామమునను రాగమై పలుకగా
చింతించె సీతమ్మ వింతగాను
శింశుపా వృక్షమున్ శీఘ్రమే వీడుచు
కనులముందరనిల్చి కదలుచుండ
రామభద్రుని సతి రాక్షసమాయగా
భావించె నత్యంత భయమునొందె

తే॥ అర్క వంశజు డొసగిన నంగులీయ
మందచేయగా భక్తితో నందుకొనెను
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ

# కపట స్నేహితులు

సీ॥ 10 స్తోత్రపాఠకులోలె మిత్రబృందము కొంత
పొగడు చుందురెపుడు పొందికగను
అటనుండి కదలుచు నటనతో కల్పితా
లల్లుచుందురుగద కొల్లలుగను
మోసకారులెపుడు ముందర నమ్మించి
యెగతాళి చేయుదు రెరుగనటుల
వమ్ముచేసెడివార నమ్ముచు నెందరో
నిందల నొందుచు కుందిరిగద

తే॥ మిత్రు డెప్పుడు మారునో శత్రువునిగ
తెలియ రాకున్నదీనాడు తేటముగను
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
నభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## స్వార్థ రాజకీయాలు

సీ॥ 11 అక్రమార్జనపరులద్భుతమ్ముగ నీతి
సూత్రాలు పలికిరి సుజనుల వలె
ఇబ్బడి ముబ్బడి డబ్బు సంపాదింప
పదవులన్ కాంక్షించి పరుగులిడిరి
నిజముగా పరికింప నీతిమంతులు సున్న
దొంగలే మననేలు దొరలునైరి
మాయ మర్మములను మనసులో నిలుపక
పట్టము గట్టిరి వంచకులకు

తే॥ కుట్రపరులను తప్పక కూల్చునటుల
ప్రజల చైతన్యపరుచుము భారమనక
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
నభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## ఉగ్రవాదము

సీ॥ 12 ధర్మ మార్గము చూపు కర్మభూమిని నేడు
మూర్ఖులు కొందరు మొరటుగాను
మతమౌఢ్యముల పేర మారణహోమాలు
సృష్టించి నిత్యము చెలగుచుంద్రు
అవివేక చర్యల నల్ల కల్లోలమై
ప్రాణాల నరచేత పట్టుకొనుచు
భీతిల్లిన జనుల పేగు బంధము తెగి
యాక్రందనలు ముట్టె నన్ని దిశల

తే॥ భయము కల్పింప చేసి నిర్భయముతోడ
సాగు ముష్కరు లెల్లరన్ సంహరించు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## రైతులు - మోసాలు

సీ॥ 13 తెల్ల బంగారము తృప్తిగా పండించి
అప్పు సప్పులు తీర్చ నడుగులిడిరి
మధ్య దళారుల మాయమాటలు నమ్మి
గిట్టుబాటు ధరకు మెట్టు దిగిరి
విధిరాత యనుకొని విక్రయింపగ వారి
కష్టార్జితము కొంత నష్టమాయె
తూకాన మోసాలు కాకి లెక్కలతోడ
రైతుల దోచిరి రాక్షసముగ

తే॥ చేయి కలిపిరి యేలికల్ చింతలేక
అన్నదాతల మేలుకై యడుగులిడరు
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## సమయపాలన లోపించుట

సీ॥ 14 విధులు నిర్వర్తింప వెనుకంజ వేసిరి
విజ్ఞులైయుండి నిర్విఘ్నులుగను
వేతనాలను గూర్చి విరివిగా నెప్పుడు
చర్చించుకొందురు శ్రద్ధతోడ
సమయ పాలన లేక సరదాగ నరుదెంచి
వంతుకు గంతేసి చింత దీరి
ఆరగింపును చేసి యాతురతను జెంది
పరుగిడుచుందురు పయన మగుచు

తే॥ పోరి పోరలు విద్యను పొందలేక
కర్మమే మని రిటచేర కలతపడిరి
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## విద్యాలయాల దీన స్థితి

సీ॥ 15 బదిలిపై నీనాడు ముదముతో నెల్లరు
పట్టణా లరిగిరి వరుస కట్టి
పంతులయ్యలు లేక పల్లె విద్యాలయాల్
చదువులు సాగక చతికిలబడె
దీనాతిదీనమై దిక్కులన్ పరికించె
నాదుకొనెడి వారు నండలేరు
విద్యాధికారులు విన్నపా లందినన్
పెడచెవి నుంచిరి ప్రేమలేక

తే॥ పోరు సల్పరు విద్యార్థి పోర లెవరు
పాలకులకైన నిసుమంత పట్టకుండె
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## అవివేకులు

సీ॥ 16 వెర్రినా వెధవలు విజ్ఞాన ఖనులుగా
సభలలో మేటిగా చాటుకొనిరి
ఉన్నత శిఖరాల నొందిన జ్ఞానులన్
తేలిక భావాన తీసివేసి
తామె సర్వస్వము తగ రెవ్వ రిట నని
మితిమీరి చేష్టల మెలగి రెపుడు
అవివేకికిని కొంద రండదండగ నుండి
వింతగా కాలము వెళ్ళబుచ్చి

తే॥ మేటి ధీశాలులు మనుచు మిడిసిపడిరి
దుష్టగ్రహములన్ తొలగించు కష్ట మనక
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## బినామి బోధకులు

సీ॥ 17 విశ్రాంతినాశించి విద్యాలయానికి
బదిలిపై నేతెంచి పంతులయలు
నిలిపి బినాములన్ నేర్పుగా తమ తమ
బాధ్యతల్ మరచిరి ప్రముఖులమని
'ఉద్దెరో దరుదెంచి యూరికి తోరణాల్
కట్టి'నట్లున్నదీ కథలు నేడు
పూజ్యులౌ గురువులు బోధింపనరుదెంచ
తన యున్కి కొరకని తగవులాడు

తే॥ పిచ్చికుక్కలై నిత్యము రెచ్చిపోయి
మొఱగు మూర్ఖత్వమును మాన్పి ముదముకూర్చు
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## కృత్రిమమైన విస్తరాకులు

సీ॥ 18 ఉరుకులు పరుగుల నుద్యోగములయందు
అలసిపోవుచునున్నరందరిపుడు
ముక్తినాశించిన భక్తిలెల్లరు నీకు
నైవేద్యమును పెట్టి నమ్ముదురయ
ప్రకృతిని లభియించె పచ్చని యాకులన్
సమకూర్చుకొనుటకై సాధ్యపడక
కృత్రిమ పత్రాలు చిత్రించి యమ్మగా
కొనితెచ్చుకొనిరయ్య కొరతలేక

తే॥ మఱ్ఱిమోదుగ వృక్షాలు మచ్చుకైన
కానరాకున్న విటనేడు కనులముందు
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## ప్రభుత్వ ఉద్యోగాలు - ప్రైవేట్ బడులు

సీ॥ 19 సర్కారు కొలువులన్ స్వాగతించిరి మేటి
వేతనా లొందిన విజ్ఞులైన
తమ తనూభవులను తప్పక యజమాని
బడులకు పంపిరి బాధ యేమొ
తోటి బోధకులను తూలనాడి రిపుడు
చొక్కము నెవ్వరో చూడుమయ్య
వ్యాపారములపైన వ్యాపకా లధికము
వృత్తిపై నుంచరు చిత్త మెపుడు

తే॥ నలుపు నెరుగని గురిగింజ కులకునటుల
నెపములను మోపుచున్నారు నీచముగను
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## ఆంగ్ల మాధ్యమములో చదువులు

సీ॥ 20 మాతృభాషయెడల మమకారమును వీడి
పరభాషపై మోజు పారజేసి
శిశువులపై తమ చిత్తప్రభావమున్
బలవంతముగ రుద్ది బడుల కంపి
మమ్మిడాడి యనుచు మరిమరి పలుకగ
సంబర పడిరిట జనకులెల్ల
విద్యార్జనాపరుల్ వేదనాభరితులై
చదువులు మానిరి బెదురుకొనుచు

తే॥ కాయకష్టము చేయరు కడుపుకొరకు
మనసు నిలకడ లేకను మసలుకొనిరి
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## వైవాహిక బంధాలు విచ్ఛిన్న మగుట

సీ॥ 21 వసుధపై నేడు వైవాహిక బంధాలు
సాగకున్నవి కొన్ని శాశ్వతముగ
ఆలు మగలమధ్య నంతరాలను చూసి
విధి రాత లందురు విజ్ఞులెల్ల
ఊహల పల్లకి నూరేగుదు మనుచు
భ్రమ చెందిన యువత బంధము విడి
క్షణకాల సుఖము లక్షణముగా భావించి
కోర్కెతో కాపురాల్ కూల్చుకొనిరి

తే॥ దంపతుల మధ్య చక్కని తలపు లుంచి
నిలుపు సంసార చక్రమున్ నెనరు చూపి
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## అక్రమ వరకట్నము కేసులు

సీ॥ 22 సతులు కొందరు నేడు పతులను విడనాడ
వంకలు చూపిరి వ్యర్థముగను
లక్షల కట్నాలు తక్షణ మడుగుచు
బాధించి రనుచు నిర్భయము తోడ
రక్షక భటులతో శిక్షింపగా నెంచి
ఫిర్యాదు చేయుచు పెచ్చుమీరి
తప్పులు మోపుచు తిప్పలు పెట్టుచు
లక్షల రూప్యముల్ లాగిరిపుడు

తే॥ వెర్రి వెధవలు వారలన్ విశ్వసించి
ఔను ఔ ననుచుందురే! యండ నిలిచి
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## ఉత్తమ దాంపత్య జీవితము

సీ॥ 23 సంప్రదాయము తోడ సచ్ఛీలురై యున్న
దాంపత్య జీవిక ధన్యమౌను
సుఖము సంతోషాలు శుభ కార్యములతోడ
వర్ధిల్లుచుందురు వైభవముగ
అడ్డంకు లెదురైన నవగాహనముతోడ
సాధింతు రైక్యమై సంతసమున
సంతాన మెప్పుడు సన్మార్గమును పొంది
వంశ కీర్తికి పాటు పడుదు రెపుడు

తే॥ భక్తి భావము వీడక శక్తికొలది
సహకరించెదరెపుడైన సజ్జనులకు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీప్రసన్నాంజనేయ!

## శతకము వ్రాయాలన్న సంకల్పము

సీ॥ 24 హృదయాన మెదలగా ముదముతో రెండవ
శతకము పూరింప సాగితినయ!
పండిత కవి నాదు పద్య గురు వగు శ్రీ
వెలుదండ వారిని వేడుకొంటి
మారుతి స్తుతికయి మకుటము సూచించి
మొదలు పెట్టు మనెను ముదముతోడ
ఆదిత్యవారాన నంజనా తనయుని
దర్శించి వ్రాయు పద్యాల ననెను

తే॥ తిథియు పంచమి శుభ మని తెలియపరిచె
నిష్ఠతోడను చేరితి నీదుగుడిని
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

# సహృదయుల ఆశీర్వచనాలు -అండదండలు

సీ॥ 25 మంజు రాధలు సుష్మ మనసార దీవింప
శతకము పూరింప సాగుచుంటి
శ్రీనివాసులు దార్ల చేయూత నొసగి నా
వీపును తట్టిరి వెరపు లేక
మౌనమై భావాలు మనసున స్ఫురియించి
పద్యాల నల్లుచు పంపుచుంటి
అక్షర దోషాలు వీక్షించి శీఘ్రమే
సరిదిద్ద చేసిరి శ్రద్ధతోడ

తే॥ సంఘమందలి పోకడల్ సంగ్రహించి
కూర్చి యందించెదను కృతి కోర్కె మీర
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

# వృద్ధాశ్రమాలు

సీ॥ 26 కన్నవారల నెల్ల గారాబముగ పెంచి
తబ్బిబ్బు లౌదురు తల్లి దండ్రి
చదువు సంధ్యలు నేర్పి చక్క నుద్యోగాలు
నున్నత హెూదాల నుండ జేసి
తగిన సంబంధాల దాంపత్య మొనగూర్చి
బాధ్యతల్ నెరవేర్చి బ్రతుకుచుండ
వృద్ధాప్య మరుదెంచి వేదనల్ మొదలౌను
పేగుబంధమునకు ప్రేమలేక

తే॥ సతుల సూచనల్ పాటించి జనకులనిక
కదలి వృద్ధాశ్రమాలలో గడుపుమనిరి
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## ప్రతిభావిహీనులు - ఉన్నత విద్య పట్టాలు

సీ॥ 27 ప్రతిభా విహీనులు పట్టాలు దొడ్డి దా
రిని దెచ్చికొని కొల్వులను మురిసిరి
పొందుగా పాఠాలు బోధింప బూనక
అధికారములను నే దందుకొనిరి
సహ బోధకుల తోడ చదువులు చెప్పించి
పబ్బము గడిపిరి ప్రముఖులమని
అత్యాశతోడ నేడన్యమౌ వ్యాపకా
లందు మనసు నిల్పి హాయిగాను

తే॥ సరిగ కాలాంశముల యందు మరువకెపుడు
నిలుపుకొనిరయ్య తమ పేరు నేర్పుగాను
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## అపురూప దాంపత్యముకొరకై శోధించుట

సీ॥ 28 సంసార జీవిక సాగింప యోచించి
సుదతికై శోధించి ముదముతోడ
కాంక్షించి కట్నాలు కాంచనమ్ము లడిగి
పీడింతు రతి నిరు పేదనైన
గుణము నెరుగక సద్గుణవంతు డని నమ్మి
పెనవేసుకుందురు పెండ్లి పేర
సంసార జలధిలో సాగుచు నిత్యము
కోర్కెల యూబిలో కూరుకొనుచు

తే॥ ఆలుపిల్లల మధ్యన మేలు లేక
కొట్టుమిట్టాడి రెందరో తట్టుకొనక
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## దుర్బుద్ధులైన ఇల్లాండ్రు

సీ॥ 29 గౌరవహీనులై గయ్యాలిగంపలు
పెనిమిటిపై కొంత ప్రేమలేక
తరచుగా నింటిలో దురుసుగా వర్తించి
దొరసానులను బోలె దొరలముందు
బంధాలు వీడను బహువంకలను చూపి
చాడీలతో సాగు సతులు గలరు
రచ్చబండకు నీడ్చి తుచ్చుల మధ్యన
నవహేళనము చేసి యాడుకొనుచు

తే॥ లేని నేరాలు మోపుచు హీనపరచి
లాగుచున్నరు డబ్బులు లక్షలుగను
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## ఆత్మహత్యలు

సీ॥ 30 సంసారమున చిక్కి సతమతమౌచును
తరుణ వయస్కులు తాళలేక
అర్థాంతరమ్మున నాత్మహత్యలతోడ
చాలించిరి తనువు శ్వాస నాపి
ప్రేమానురాగాల పేగు బంధము నేడు
పీనుగై యుండగా పితరు లెల్ల
కుమిలి కుమిలి యేడ్చి గోడాడుచున్నారు
దిక్కెవ్వ రనుచును దిగులు బడిరి

తే॥ కోర్కె పుట్టలను చిదిమి కుదురుగాను
ఉన్నదానితో సంతృప్తి నొందు మనుము
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## మూఢనమ్మకాలు

సీ॥ 31 చిత్తభ్రమలతోడ చీకట్లు క్రమ్ముచు
దిక్కు తోచని జనుల్ తిక్కరేగి
గాలిదయ్యాలన్న గోలలో మునుగుచు
మంత్రతంత్రాలపై మనసు నిలిపి
మోసకాండ్రను చేరి మోకరిల్లుచు నిక
ధనము వెచ్చించిరి దండిగాను
ప్రేతాలు వీడక పీనుగలైరయా!
బక్కచిక్కినవారు బ్రతుకలేక

తే॥ నీదు నామమే మంత్రమై నిక్కముగను
రోగములనెల్ల మాన్పును రూఢిగాను-
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## మోసాలు - పూనకాలు

సీ॥ 32 దేవుని దరి చేరు దీనులన్ నేర్పుగా
నమ్మింతు రత్యంత నటనతోడ
భుక్తికై యాశించి పూనకా లూగుచు
దేవు నాజ్ఞలు మీకు తెలుపుదు మని
కొంద రజ్ఞానుల డెందాల పసిగట్టి
సుద్దులు తెలుపగా చోద్యముగను
చుట్టూర ప్రజలకు స్తోత్రమై చెవి చేరి
దర్శింప నరుదెంచి ధనమునొసగి

తే॥ మోసపోవుచునున్నారు మ్రోలవ్రాలి
మోసకారుల బుద్ధిని ముట్టడించు-
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
నభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## అమావాస్య బిగుదినము

సీ॥ 33 మంత్ర తంత్రముల కమావాస్య బిగు వని
ప్రజలను నమ్మించి బ్రతుకువారు
గజ్జె కట్టుచు నాడి  కలవరమ్మును లేపి
దయ్యాలు భూతాల తరుముదు మని
ఊదు పొగలు వేసి రుత్త మాటలు పల్కి
పసిడి పైకము లాగి బ్రతుకుచుండ
అవివేకులును కొంద రౌ నని నమ్ముచు
కైమోడ్చి నిలుతురు గౌరవమున

తే॥ నిన్ను నమ్మిన భక్తుల నెనరుతోడ
కంటికిని రెప్పవలె నీవు కావలేద?
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా శ్రీప్రసన్నాంజనేయ!

## రామనామ మహిమ

సీ॥ 34 కోసలాధీశుని గుణముల కీర్తింతు
ముక్తికై నేను సద్భక్తితోడ
ఆరామచంద్రుని యష్టాక్షరీ మంత్ర
మంతరాత్మల నిల్పి హాయిగూర్చె
రామనామమునందు రమియించి మనసంత
ఓలలాడుచు నుండె నూయల వలె
అష్టకష్టమ్ముల నంత మొందించుచు
ముక్తి ప్రసాదించు ముదము తోడ

తే॥ సీసపద్యాల నల్లించి శ్రేష్ఠముగను
భావయుక్తమై సాగించు భారమనక
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
నభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ

## శ్రీరామ చంద్రునకు ప్రియమైన వాడ

సీ॥ 35 నీ దివ్య రూపము నేత్రాల ముందర
కదలాడుచున్నది కపికుమార!
సీతమ్మ జాడకై చెలగి విజృంభించి
లంఘించి సంద్రమున్ లంక కేగి
లంకిణి మొదలుగా లంకేశు సేనను
రక్తితో కూల్చిన రామబంట!
చూచిరమ్మనగానె నీచుని నగరమున్
కాల్చివచ్చినమేటి కపికుమార!

తే॥ తరుణిజానకి యునికిని నెరుకపరచి
ప్రియము కూర్చిన వానర ప్రియతనూజ!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీప్రసన్నాంజనేయ!

## రామశబ్ధ రహితమైన మాల

సీ॥ 36 సీతమ్మ యొసగిన శ్రేష్ఠమౌ మాలను
శ్రవణాల చెంతను సరిగ నిలిపి
రామనామ మనెడి రవమందు లేదని
పూస లన్ని కొరికి తీసివేసి
ఆ పరంధాముని యభిమానమును పొంది
కొనసాగుచుంటివి వినయముగను
నమ్మిన బంటువై నెమ్మనమ్మున నిల్చి
పాదాలచెంతను ప్రణతితోడ

తే॥ ముకుళితములగు హస్తాల ముదము కలిగి
నామమంత్రము మరువని రామబంట!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## స్వామి నిజరూపము వీక్షింప కోరుట

సీ॥ 37 సారహీనంబైన సంసారమును వీడి
వైరాగ్య మొందితి వరము నిమ్ము
నీ దివ్య నామమున్ నిష్ఠతో స్మరియించి
మోక్ష మాసించితి ముక్తి నొసగు
జీవకోటిని భువి శ్రేష్ఠమౌ జీవిక
మానవు డని రయ్యె మాన్యులెల్ల
చాలు నా కీ జన్మ సంతోషముగ నిన్ను
భక్తితో కొలుతును శక్తి కొలది

తే॥ కంటి కగుపించ వేలనో కమ్రనేత్ర!
అసలు నీవున్నవా! లేద! యవనిపైన-
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## ఈనాటి పంటలు మనుషులకు రోగాలు

సీ॥ 38 రోగాలతో జనుల్ రోదించి నిత్యము
మందు మాకులు తిని మానలేక
పొలము పుత్రుల నమ్మి పోరాడుచున్నారు
వైద్యాలయాలకు వరుసగట్టి
దరి దాపులను వీడి దవ్వుల కేగుచు
పార్థివ దేహాలు పట్టి తెచ్చి
కర్మకాండలు చేసి కడుపు కూటికొరకు
స్వస్థలమ్ములు వీడి సాగుచుంద్రు

తే॥ పాడు పంటలు పల్లెలో పరిఢవిల్లె
నాటి ముడి ధాన్యములు పొంద చాటు మయ్యె!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

# ముక్తికి మార్గదర్శి

సీ॥ 39 వయసు తరిగి పోయె వార్ధక్య మరుదెంచె
పుణ్యసంపద కోరి పూనలేదు
తాత్కాలికమునైన తరిగిపోయెడి ధన
మాశించి సమకూర్చ నడుగు లిడితి
కుక్షి నింపుకొనుచు కొరత లే దని నమ్మి
సోమరినైతినే సుఖము కోరి
దారి చూపెడి వారు తారసపడకయే
యవివేకితనముతో నడుగులిడితి

తే॥ భక్త కవియైన వెలుదండ పట్టి తట్టె
దారి చూపించె నిప్పుడు ధన్యునైతి
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

# మారుతి మార్జాల రూపము

సీ॥ 40 రావణు లంకకు రాక్షస సేనలు
కంచుకోటగ నైరి కదలకుండ
గా లీగలేని యా కట్టుదిట్టమునైన
రక్షణ ఛేదింప దీక్ష బూని
మారుతి రాయుడా! మార్జాల రూపమై
సూక్ష్మాతిసూక్ష్మమై చూడబడక
యతివేగమున లంక నసురుల చెండాడి
లంకేశునకు తెల్పి లక్షణముగ

తే॥ రామచంద్రుని దరి చేరి రమణి సీత
క్షేమ మెరిగించి నట్టి యో చిద్విలాస!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## కన్నీటితో అభిషేకము

సీ॥ 41 ఏ పాపమో గాని యీ నేలపై బుట్టి
దుష్టుల మధ్యన దుఃఖపడితి
క్షణ భంగురమ్ము రక్షణ లేశమును లేని
సౌఖ్యము నాశించి సతిని పొంది
సహ జీవనము చేసి సంకటమ్ములతోడ
శ్వాస పీల్చుటయైన సాధ్యపడక
అవమానభారమై యండదండయులేక
నొంటరినై నిల్చి యుంటినయ్య

తే॥ నిత్యమును నీకు నాదు కన్నీళ్ళతోడ
ఆచరించితి నభిషేక మండకొరకు
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## కుటుంబీకులు - ద్రవ్యదాహము

సీ॥ 42 రక్త బంధము ననురక్తి ద్రవ్యముపైన
కనబర్చి జనకులన్ కలిసి మెలసి
ఆప్యాయతను పంచి యన్న పానీయాలు
చెంత చేర్చుదు రెప్డు చింత లేక
దేహ బాధల నొంది దీనతన్ బడియున్న
చీదరించి దరికి చేర రెవరు
మూతి ముక్కు పొడిచి ముళ్ళడించెదరెప్డు
పిడికెడు మెతుకులు పెట్ట రెవరు

తే॥ శ్వాస విడనాడగా వట్టి సానుభూతి
నొలుక బోయుదు రేడ్పుతో నొనరుగాను
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## గుండెల్లో కొలువైన కోదండపాణి

సీ॥ 43 ధ్యాన నిమగ్నతన్ దశరథ తనయుని
నామజపముచేత నడచువాడ
హృదయారవిందాన నృప రామచంద్రుడు
దివ్య రూపము దాల్చి తేజరిల్లె
తరుణి జానకితోడ తమ్ముడౌ లక్ష్మణు
డిరు వైపులను నుండి రిష్టముగను
చిన్మయ రూపుడు చిద్విలాసముతోడ
కోదండపాణియై కూర్మి కలిగి

తే॥ వరము లందించె, భక్తులు మురిసిరంత
ముడుపు లొసగిరి యత్యంత ముదముతోడ
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## అపనమ్మకము తొలగిపోవుట

సీ॥ 44 మనసు కలత చెంది మౌనమై నీనామ
మంత్రము స్మరియింప మరల మరల
తన్మయత్వము చెంది తగు రీతి దేహము
గాలిలో తేలుచు కదలుచుండె
విశ్వాంతరాళాన విహరించినట్టుల
దృష్టికి తోచెను దివ్యపురుష!
సీతమ్మ నిను చిరంజీవిగా దీవించె
నది నిజమని తోచె నంజనిసుత

తే॥ శిల్ప రూపమే యనినాదు చిత్తమందు
నిలిచియున్నటి భావము తొలగెనిపుడు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## తీర్థ క్షేత్రాల మహిమ

సీ॥ 45 విఘ్నంబు లెన్నియో వెంటాడుచున్నవి
మనసు నిల్కడ లేక మసలుకొనుచు
కమలనాభుని గుడి కడకేగి ప్రార్థింప
మారుతాత్మజ నాదు మనసు కుదిరె
నిశ్చింతగా నట నెమరు వేయుచునుంటి
భావాలు స్ఫురియించె వైభవముగ
స్వామి మహిమతోడ సంతోషముగ కొన్ని
పద్యాల నల్లితి పట్టు విడక

తే॥ క్షేత్ర తీర్థాలు విఘ్నమున్ క్షీణపరచు
మనసు సాంత్వనమౌ నని మాన్యు లనిరి
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా! శ్రీప్రసన్నాంజనేయ!

## సర్వము సమర్పించుట

సీ॥ 46 నీ మందిరముచేరి నీ రూపు దర్శించి
నీ నామము మదిని నిలుపుదునయ!
నీ గానమే చేతు నీ గాథలే విందు
కడదాక నన్నేలు కరుణతోడ
సారహీనమునైన సంసార జలధిని
దాటతరము కాదు దారి చూపు
అతి భయంకరమైన యపరిమితంబైన
యాశలు చీల్చి చెండాడు నెపుడు

తే॥ జన్మ జన్మల బంధము చాలు నయ్య
కొట్టుమిట్టాడుచున్నాను పట్టు విడక
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## మూర్ఖపు మనస్తత్వము

సీ॥ 47 అల్పబుద్ధిని కల్గి యాలోచనలు లేక
గర్వాంధకారాన కదలుచుంటి
జ్ఞానుల బోధ నజ్ఞానినై మెలగుచు
చెవిని వేయక యుంటి, చెడితి నయ్య!
స్వైరవిహారినై సరదాగ గడుపుచు
నీ ధ్యాస మరచితి నెరుకలేక
నిందలతో నపనిందల కుందుచు
సాగె నీ జీవిక చాలు నయ్య

తే॥ మూర్ఖతను మాన్పి శీఘ్రమే ముదముతోడ
జ్ఞానమార్గాన నిలుపుము నయముగాను
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
అభయ మొసగుమా! శ్రీప్రసన్నాంజనేయ

## భాషా నిలయము భ్రష్టుపట్టి పోవుట

సీ॥ 48 అసమర్థ ప్రాచార్య నవివేక చేష్టలన్
ప్రాచ్యకళాశాల పతనమాయె
అధికార దాహాన నభివృద్ధి శూన్యమై
గత వైభవము నిల్ప కదలకుండె
శుష్క ప్రియాలతో శూన్య హస్తాలతో
నిర్వాకమును చేయ నిలిచియుండె
భక్తితో మీపాద పద్మమ్ములకునిత్య
మభిషేకమునుచేయుదాదుకొనుము

తే॥ సంస్థ నెలకొల్పె నానాడు సజ్జనుండు
భ్రష్టు పట్టించెనీనాటి పాలకుండు
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ

## రాజకీయ నాయకులు పార్టీలు మారడం

సీ॥ 49 అత్యాశపరులు నే డవకాశవాదాన
ధనము సంపాదింప దారు లరసి
కండ్లప్పగించియు కదలక గోడపై
మార్జాలములవోలె మాటువేసి
పదవుల నాశించి పార్టీలు మారుచు
కోట్ల కొలది సొమ్ము కొల్లగొట్టి
నీతిమంతుల మని కోతలు కోయుచు
ప్రజలను నమ్మించి పదవులొంది

తే॥ నిత్య మూరేగుచున్నారు నీచుల నిక
నడ్డగింపుము, పాలన నాపుమయ్య!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## యువజన సంఘాలు

సీ॥ 50 ఊరూర నెన్నియో యువజన సంఘాలు
నుద్భవించుచునున్న వున్నతముగ
అజ్ఞాన విషయాల నంతమొందించుచు
ప్రజలను చైతన్య పరచవలెను
అధికారదాహులు యభిమానపు వలల
విసరగా భ్రమపడి వింతగాను
నుచ్చులో చిక్కిరి తుచ్ఛులైపోయిరి
మందు విందుల రుచి మరిగిరిచట

తే॥ అర్థవంతమౌ జీవికల్ వ్యర్థమాయె
జ్ఞాన మందించి వారిని నడుపుమయ్య!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## కుల సంఘాలు

సీ॥ 51 కులసంఘములు నేడు కోకొల్లలుగ పుట్టె
అధికారపీఠాల నందుకొరకు
కుట్ర కుతంత్రాల గుణహీను లెందరో
నాయకులై నిల్చి నడుమ నడుమ
వర్గ వైషమ్యాల మార్గ మన్వేషించి
రిచ్చతో నిత్యము రెచ్చగొట్టి
మనుజుల మధ్యన మారణహోమాలు
సృష్టించి రిసుమంత సిగ్గులేక

తే॥ మోసకారులు దాల్చిన ముసుగుల నిక
తొలగజేయుము శీఘ్రమే తోచునటుల
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## సరస్వతి దేవి దర్శనము

సీ॥ 52 "శారదాంబా! నన్ను సాహితీరంగాన
ప్రోత్సహించుము తల్లి పూర్తిగాను
వెన్ను దన్నుగ నుండి విరివిగా భావాలు
స్ఫురియింప జేయుము సొగసుగాను
వైభవోపేతమౌ వర్ణన లందించి
పద్యాల నల్లించు ప్రతిభతోడ
శతకంబు పూర్తిగా శ్రద్ధతో సాగించి
సార్థక మ్మొనరింపు జన్మ" ననుచు

తే॥ స్మరణ జేసితి నత్యంత శ్రద్ధకలిగి-
పలుకు లందింప నరుదెంచి పలుకరించె-
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

# గృహ హింస

సీ॥ 53 సరిగ గృహస్థులై సాగ నిష్టములేని
సతులుందు రీనాటి సంఘమందు
బాధ్యతల్ విడనాడి భర్తలన్ హింసించి
మొగుడు కొట్టె ననుచు మొత్తుకొంద్రు
దుర్బుద్ధులున్నటి దుర్మార్గులనుచును
నేరాలు మోపిరి నీచమతులు
పిచ్చికూతలు కూసి రెచ్చిపోయి తుదకు
గృహ హింస పేరున గెలువనెంచి

తే॥ రక్షక భట నిలయమున రంతు చేసి
పరువుదీయుటనిసుమంత భావ్యమగునె
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ

# చట్టాలు కొందరికి చుట్టాలు

సీ॥ 54 చట్టాలు కొందరి చుట్టాలుగా మారె
బింకాన నుండిరి మంకుతోడ
బెదిరించి నిత్యము బెంబేల నెత్తించి
కాలము గడుపుచు కదలి రిపుడు
గృహహింస చట్టము గృహిణుల చేతిలో
వజ్రాయుధముగాను వాసికెక్కె
అవివేకులకు నివి యస్త్రశస్త్రము లాయె
పరు వున్న మెడలకు పాశమాయె

తే॥ సజ్జనులు సాధుపురుషు లీ సంతలోన
కలిసి జీవింపగా లేరు గౌరవమున
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## కార్య శూరత్వము

సీ॥ 55 బాలభానుని కాంచి ఫలముగా భ్రమచెంది
యారగించుట కొరకాకసమున
నరుగుచుండగకాంచె నమరేంద్రుడాత్రుతన్
వజ్రాయుధము వేసె వైరి యనుచు
ముఖముపై ఘాతమై మూర్ఛిల్లితి వటంచు
కోపించి వాయువు కుమిలిపోయె
బ్రహ్మాండమంతయు ప్రాణవాయువు నాపె
చలన మాగెను చరాచరమునెల్ల

తే॥ కార్యశూరత్వమున నెప్డు కదలువాడ!
మోకరిల్లితి మీముందు ముదముతోడ
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## హనుమంతుని లీలలు

సీ॥ 56 సీతమ్మ భ్రమ మాన్ప శీఘ్రమే దేహము
పెంచి యాకాశాన నుంచలేద!
రావణున్ వధియింప రయముగా సంద్రాన
వారధి నిర్మించితీరలేద!
అసురులు వాలము నంటించగా లంక
భగభగ నీచేత రగులలేద!
దివి భువి యేకమై దిగ్దిగంతాలకు
తరలుచు నీకీర్తి తాకలేద !

తే॥ ఇరుకు గదిలోన నున్నావ దేల నయ్య!
చెవికి సోకదా మా మొర చింతమాన్ప!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

# జితేంద్రియత్వము

సీ॥ 57 సీతమ్మ జాడకై చేరి లంకాపురి
యమరావతిని పోలు నందమైన
స్వర్ణ కాంతుల నీను శయన మందిరమందు
రావణ బ్రహ్మతో రమణులెల్ల
ముద్దులు మురిపాలు పొద్దుపోయినదాక
మన్మథ క్రీడతో మసలి రచట
సోయిలేకపడిన సుదతులన్ కాంచియు
కర్తవ్యమునెరిగి గౌరవముగ

తే॥ మనసు చెదరక లక్ష్యమై మసలినావు
కార్యదీక్షతో ముందుకు కదలినావు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

# కలియుగమున అసురులు

సీ॥ 58 శోకతప్తయయి యశోక వనిన్ గల
వైదేహి నిన్ గాంచె వాయు తనయ!
అసుర కాంతలు చేరి యవివేక వాక్కులన్
నుడువగా హృదిలోన నొచ్చుకొనెను
కుందుచు హృదిలోన కుమిలి కుమిలి యేడ్చె
దిక్కెవ్వరని చాల దిగులు నొందె
అబల కా సమయమం దండదండగ నిల్చి
యూరడించిన మేటి ధీరుడవుగ!

తే॥ సుదతు లెందరో కన్నీటి సుడులయందు
మ్రగ్గుచున్నారలీనాడు మౌనమేల?
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

# చతురోపాయములు -దండన

సీ॥ 59 శ్రేష్ఠమౌ కార్యమున్ శిరసా వహించుచు
సాధింప ముందుకు సాగితి వయ!
సుగ్రీవు నాజ్ఞను సురలోకమును మెచ్చ
సఫలమై నిలిపిన సచివుడ వయ!
రూఢితోడను చతు రోపాయములనెల్ల
యోచించిన సమర యోధుడ వయ!
దనుజుల శిక్షింప దండన మార్గమున్
పాటించితివి రామ భక్తుడవయ!

తే॥ మౌన మే లయా యీనాడు మనసు లేద!
ముక్తి నొసగితి వానాటి శక్తి లేద!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

# సౌభ్రాతృత్వము (సోదర ధర్మము)

సీ॥ 60 సౌభ్రాత్రమును చాటె సౌమిత్రి సాక్ష్యమై
విఖ్యాతి గాంచెను విశ్వమందు
అనుజన్ముని విడువ కభిమానపాత్రుడై
వెన్నంటి తిరిగెను విపినమంత
సతి యూర్మిళను కూడ మతిలోన నిలుపక
భక్తితో నడిచెను బాధపడక
రావణు నెదిరింప రణరంగమున దూకె
ప్రాణభయము లేక పట్టుదలను

తే॥ మహిని కానరా వానాటి మమత లిపుడు
ద్వేషములతోడ సోదరుల్ తెగడుకొనిరి
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## భార్య భర్తల అన్యోన్యత్వము

సీ॥ 61 అవనిపై దంపతు లన్యోన్యత కలిగి
తోడునీడగ నుండ త్రోవజూపె
కష్టాల కెదురీగి కడదాక పతివెంట
కొనసాగె ముదముతో కోమలాంగి
విధివ్రాత వెంటాడి విడదీసె బంధమున్
నిండుగా హృదిలోన నిలుపుకొనుచు
భక్తి శ్రద్ధల తోడ ప్రాణనాథునెపుడు
స్మరణ చేయుచునుండె సాధ్వీసీత

తే॥ సతులు పతులును కలహాల సాగి రిపుడు
సహన శీలము విడనాడి చంపుకొనిరి
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## పుత్రధర్మము

సీ॥ 62 పుత్ర ధర్మముగూర్చి భువనాల కెరిగించె
దశరథ తనయుడు ధర్మమూర్తి
పినతల్లి భర్తను పీడించి యానాటి
వరముల కొరకయి పట్టుబట్టె
కారణ జన్ముడు కౌసల్య తనయుండు
కైకేయి మాటలన్ గౌరవించి
వనవాసమున కేగి వనచరులను కూడి
యసురుల తెగటార్చె నవనియందు

తే॥ తండ్రి యాజ్ఞను పాటించు తనయు లేరి?
యెందరో పెడచెవినుంచి రిలను నేడు-
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## గురుశిష్య సంబంధము

సీ॥ 63 విద్యార్జనాపరుల్ విజ్ఞానమూర్తుల
బోధనల్ శ్రద్ధగా పొందవలెను
విజ్ఞాన భాండమున్ విరివిగా శోధించి
సారమున్ రాబట్టి సఫలముగను
జీవితాల కొసగి చింత లేకుండగా
నొనరుగా నిలుపుదు రున్నతమున
పరుసవేదిని పోల్చ ప్రామాణికము కాదు
గురుదేవునకు సాటి ధరణియందు

తే॥ గుప్త విషయాల నెరిగించు గురునకెవరు
సాటిలే రయ్య భువనాల సకలమందు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## సజ్జన సాంగత్యము

సీ॥ 64 సజ్జన పాలితో సాంగత్యమైయున్న
సకలార్థ సిద్ధులు సంతరించు
సాహసమ్మున నగ్ని లోహసంపర్కమై
సమ్మెట పోటులన్ చచ్చినటుల
దుర్బుద్ధులు నెపుడు దోషాల నంటించి
పడద్రోయుచుందురు పాపమందు
పుణ్యాత్ము లొనరించు పుణ్యకర్మలు మన
పరిసరా లంతట వ్యాప్తిచెందు

తే॥ చెడు తలంపులు తొలగును చిత్తమందు
చంచలత్వము మాన్పును శీఘ్రముగను
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
నభయ మొసగుమా! శ్రీప్రసన్నాంజనేయ

# మితభాషణము

సీ॥ 65 సత్యసంపన్నులు సత్పురుషులు భువిన్
మితభాషణమున నమితమునైన
దివ్యశక్తినిపొంది దివ్యదృష్టిని కల్గి
విశ్వాంతరాళాన విభ్రమముల
ధ్యానులై వీక్షించి ధన్యులై నిత్యము
మార్గదర్శకులైరి మనుషుల కిట
మహితాత్ములెల్ల నిర్మలమైన హృదయులై
మాట్లాడు ప్రతిమాట మంత్ర మాయె

తే॥ వ్యర్థ సంభాషణల జేసి వసుధపైన
కాలమును పుచ్చితిని నేను కడను దాక
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

# స్థిత ప్రజ్ఞత

సీ॥ 66 స్థితప్రజ్ఞులెల్ల నిశ్చింతతో నుందురు
యుప్పెన లెదురైన తప్పుకొనరు
సుఖ దుఃఖములయెడ చూడ్కులు సమములై
పొంగరు క్రుంగరు బెంగపడరు
వైరులందున హృది వజ్రతుల్యముగాను
సుజనుల యందున సుమముయగును
రఘుకులాన్వయుడైన రామచంద్రుడె సాక్షి
త్రేతాయుగమునందు తేల్చి చెప్పె

తే॥ అల్పసంతోషులీసంఘమందు గలరు
వెలితి కండలై మెలిగిరి వెర్రి మతులు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీప్రసన్నాంజనేయ!

# వేదాంత రహస్యము

సీ॥ 67 వేదాంతరంగమే విశ్వ విజ్ఞానము
శాఖోపశాఖలై సకలమాయె
సగుణ నిర్గుణములు సంస్థితమై యుండి
ధర్మాది తత్వాల మర్మమాయె
సృష్టి లయము గూర్చి ద్రష్టలు గుర్తించి
రవధూతలై చాటి రవనినంత
పరమాత్మ నెరుకకై భక్తిశ్రద్ధలతోడ
వేద చతుర్దశ విద్యలెల్ల

తే॥ తాత్వికులు నెంద రెందరో తరచితరచి
వివిధ రూపాలు చూపిరి విశ్వమంత
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

# కర్మభూమి - భోగభూమి

సీ॥ 68 పుట్టుట గిట్టుటల్ పుడమిపై జీవికల్
కర్మానుసారము కలుగుచుండు
భుక్తి ముక్తిని కోరు భోక్తృ భక్తులుకూడ
భోగ కర్మల భూమి పుట్టుచుంద్రు
సంసారమున నిల్చి జన్మ సార్థకతకు
పురుషోత్తమునిగూర్చి పూజ సలిపి
ముక్తి నాశింపక ముదముతో పరదేశ
భోగలాలసులయి సాగి రిపుడు

తే॥ దైవ చింతన లేనట్టి జీవి కెపుడు
సిరుల తులతూగు మూర్ఖపు చింత లేల?
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## ప్రత్యక్ష దైవాలు

సీ॥ 69 తల్లిగర్భమునుండి ధరణిపై నరుదెంచి
గురువుల చెంతను గుఱుతు నెరిగి
నీతి నిజాయితి నియమవర్తన లున్న
జీవిక యంతయు శ్రేష్ఠమగును
ఇబ్బడి ముబ్బడి నిడుమలు నెదురైన
దైవకరుణచేత దరికిరావు
శ్రీరామ రక్షయై చెంత కాపును కాచి
ధర్మమార్గమునందు తరలజేయు

తే॥ తల్లిదండ్రులు గురువులు నెల్లరకును
భువిని ప్రత్యక్ష దైవాలు పొందికగను
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## నిరాడంబరత

సీ॥ 70 అవనిపై జ్ఞాని నిరాడంబరము కల్గి
కొనసాగుచుండు సద్గుణముతోడ
ఉన్నంతలో తృప్తి నొనరుగ జీవించు
నందని పండ్లకై యాశపడడు
అజ్ఞాని నిత్యము నాడంబరాలతో
నూరేగుచుండును తీరుదప్పి
అప్పుసప్పులుచేసి యవివేకితనముతో
సూటుబూటుల నేసి సోకుబడును

తే॥ రూప సంపద లేవైన రూపు మారు
ప్రజ్ఞ సద్గుణమ్ము లెపుడు పరిఢవిల్లు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## శతకము వేగముగ కొనసాగుట

సీ॥71 పరుగెత్తెను మనస్సు పంచకళ్యాణియై
పద్యాలు పూరింప ప్రాకటముగ
చీకాకు పడజేసె లోకంపు పోకడల్
సంగ్రహించుచు సాగె సాహసమున
అంజని తనయ నీ యండదండల చేత
భావాలు సమకూర్చి భక్తి తోడ
శతకము పూరించి కృతకృత్యుడను నైతి
ముద్రింప బూనితి ముదముతోడ

తే॥ ఎరుక పరచితి నాత్మీయులెల్లరకును
ప్రోత్సహించిరి విజ్ఞులు పూర్తిగాను
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## అధికార దాహము

సీ॥ 72 సింహాసనమునకై చిత్త మోపినరీతి
కోట్లను వెదజల్లి రోట్లకొరకు
ప్రజలకు నెరవేసి వాహనాల్ సమకూర్చి
తండోపతండాలు తరలు దనుచు
నీతిమంతులవోలె నేతలు వల్లించు
మాట లన్నియు నీటి మూటలాయె
మందు విందులతోడ మైమరిపించుచు
చీమల బారులై చేరుటకును

తే॥ కూలి డబ్బులతో సమకూర్చుకొనిరి
సభల నన్నిట వీరలే సాక్ష్యములయ!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## వివిధ ధర్మాలు

సీ॥ 73 వేదవిద్యలు భువిన్ విహితమౌ ధర్మాలు
పాటించ నిలిపెను భద్రముగను
ఇంటిల్లి పాదులు తంటాలు పడకుండ
తమతమ బాధ్యతల్ తలను దాల్చి
కొనసాగిన గృహము దినదిన వృద్ధితో
సుఖ శాంతములతోడ శుభము కలుగు
గాఢాంధ కారమౌ కష్టాల కడలిని
తొలగించు నత్యంత దూరముగను

తే॥ తల్లిదండ్రుల తదితర ధర్మములను
మూర్ఖ చిత్తుల కెరిగించి మొట్టె మాన్పు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## ఆత్మోదయము

సీ॥ 74 ఆత్మోదయము చేత నన్యోన్యతను కూర్చి
సుఖముగా జీవింప శ్రుతులు నుడివె
స్వార్థము లోభముల్ వ్యర్థమౌ నర్థముల్
దుర్బుద్ధితో దోచి దొరల మనుచు
ఆత్మీయులకునైన హానిని తలపెట్టి
వెలిగెడి స్నేహమున్ వీడవలెను
సహృదయులై యుండి సంఘమం దెల్లర
క్షేమమున్ కాంక్షించు కీడు వలదు

తే॥ అయ్యా! ఆత్మోదయమునకు నర్థ మిదియె
సాక్షి గురుశిష్య బంధము సరిగ పోలు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## మానవ జన్మ విశిష్టత

సీ॥ 75 జీవకోటిని బ్రహ్మ సృష్టించి భువియందు
మనుజ జన్మయె శ్రేష్ఠ మనుచు తెలిపె
తత్త్వవిచారణ తదితరమ్ముల యందు
ప్రత్యేక మైన దీ ప్రాణి కెపుడు
పురుషార్థముల నెల్ల పూని సాధించిన
జన్మ సార్థకమౌను సజ్జనులకు
దేహమే జీవికి దేవాలయమనుచు
చిత్తశుద్ధిని కల్గి చిత్తశాంతి

తే॥ స్నేహము కరుణ హర్షముల్ చింత కల్గి
తగు నుదాసీనతల తోడ తరలుమనుము
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
కభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## వాగ్భూషణము

సీ॥ 76 సూనృత వాక్కులు సుమధురమై యుండు
సుజన మైత్రిని కూర్చు సులభముగను
రాక్షసీ వాక్కు వైరమ్మును పోషించు
బంధుమిత్రుల నెల్ల భంగపరచు
సూనృత వ్రతులకు శుభముల నెన్నియో
కామ ధేనువుగను కలుగజేయు
అభివృద్ధి కంటకా లలసటలు నిరాశ
నిస్పృహల్ హృదయాన నిలుపరాదు

తే॥ ఉద్యమము బుద్ధి సాహసమ్మొనరుగాను
ధైర్యవంతుల యెడ నుండు దైవ మెపుడు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## స్వామిని ప్రత్యక్షమగుమని ప్రార్థించుట

సీ॥ 77 దర్శన మ్మొసగు ప్రదక్షిణల్ జేసితి
తప్పకుండగ సన్నిధానమందు
ప్రణమిల్లితిని నీదు పాదపద్మాలను
విడువకుంటిని దేవ విశ్వసించి
భక్తితో నీచెంత భజన చేసితి నయ్య!
ఆదుకొందు వనుచు నాశపడితి
ముదముతో నీముందు మోకరిల్లితి నయ్య!
దరిచేర్చుదు వనుచు తలపు కలిగి

తే॥ ఉలుకు పలుకును లేదు నీ యునికి యిచట
కలద! లేదా! యని మనసు కలవరించె
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## ఆత్మనివేదన

సీ॥ 78 విశ్వసించితినయ్య! విన్నవించితి నీకు
తీరని బాధలన్ తీర్చెద వని
ఆత్యాశపరుడనై యండ నుండెద వని
ప్రార్థించితిని దేవ పగలు రాత్రి
త్రికరణ శుద్ధితో తృప్తిగ మదిలోన
నిష్ఠతో నిలిపితి నీదు రూపు
అన్యుల నెవ్వర నర్థింపకుంటిని
యన్నియు నీవె న న్నాదుకొనుము

తే॥ కనుల చూడవ దేలయా! కపికుమార!
అలసిపోతివా! రక్షింప తలపు లేద!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## లంకలో భీకరమైన పోరు

సీ॥ 79 భీకరాకార నీ భీషణ ధ్వనులకు
అల్లాడి రట లంక నసురులెల్ల
ముష్టి ఘాతాలకు మూర్ఛిల్లి రసురేంద్రు
సేనలో భీకరుల్ చెమట బట్టి
నీ యుగ్ర రూపాన నేత్రంబులెరుపెక్కి
సూర్య గోళములాయె చూపరులకు
అగ్నికీలలమధ్య హతమైన మిడుతల
దండులై నీపైన దాడిచేసి

తే॥ నేల కూలిరి యెందరో నిలువలేక
చీల్చి చెండాడితివి గదా చిద్విలాస!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీప్రసన్నాంజనేయ!

## స్వామి ఉనికిని ప్రశ్నించుట

సీ॥ 80 నీవుంటి వని నమ్మి నే నుంటి దీక్షతో
మండల దినములు మనసు నిలిపి
తరులను వెదకుచు విరులను సమకూర్చి
అర్చనల్ చేసితి నండకొరకు
మౌనవ్రతము బూని మడి గట్టుకొని నీకు
పక్వమ్ము జేసితి పాయసముల
నమ్మకమ్మును కల్గి నైవేద్యమునుపెట్టి
కీర్తించితిని గదా కీర్తిసాంద్ర!

తే॥ ఆలకించవు నామొర, నేల నయ్య!
అవిటివా! మూగివా! నీవు అంజనసుత!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

# భవబంధ విముక్తి

**సీ॥** 81 మారుతాత్మజ నాటి మహిమలు ఘన మని
చెవులార వింటిని చిత్తగించి
లంకలో జానకి సంకటమ్ములనెల్ల
కడతేరిచిన మేటి కథలు వింటి
తారక మంత్రాన తన్మయత్వము చెంది
మొర లాలకించుచు వరము లొసగి
భవబంధముల ద్రుంచి భక్తుల కాచిన
దొర వని వేడితి దోసిలొగ్గి

తే॥ నేడు శిల్ప రూపము దాల్చి నిలిచినావు
భారమాయెనా నాతోడ పలుకవేల
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీప్రసన్నాంజనేయ!

# జంబుమాల్యాదుల సంహారము

సీ॥ 82 దంభాసురులు మరి జంబుమాల్యాదులన్
సంహరించిన మేటి శక్తిరూప!
అసురేంద్రు పైన పేరలుక బూనుచు మేటి
ప్రమదావనమ్ము విధ్వంసపరచి
సింహ గర్జన జేసి చెలగి విజృంభించి
సమరమ్మునకు పిల్చి సమ్మతించి
కుప్పిగంతుల చేత ముప్పుతిప్పలు బెట్టి
గడగడ లాడించి గగనమందు

తే॥ చిందులను వేసి చెండాడి చీల్చివేసి
రావణుని కెరిగించిన రామదూత!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీప్రసన్నాంజనేయ!

# అక్షకుమారునితో యుద్ధం

సీ॥ 83 అసురేంద్ర సుతుడైన యక్షకుమారుని
పోరు నేరుపు జూచి ప్రోత్సహించి
సరిజోడుగా నెంచి సరదాగ నాడించి
నేలకూల్చితివయ్య నింగినుండి
ఇంద్రాదులెల్లర నిరుకున పెట్టెడి
మేఘనాథుడు వచ్చి మింటనిలిచె
అస్త్రశస్త్రాలతో నడ్డుకోలే మని
బ్రహ్మాస్త్ర మనియెడి బంధనమున

తే॥ చుట్టి వేయగా రావణున్ చూచుట కని
యసురులకు చిక్కితివి కద యంజనసుత!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా శ్రీప్రసన్నాంజనేయ!

# రావణునికి ధర్మోపదేశము

సీ॥ 84 దనుజేంద్రునకు నీవు ధర్మ మధర్మము
హితబోధ చేయగా కుతకుత మని
ఉద్రేక భరితుడై యోపిక నశియించి
అంతమొందింపగా నాజ్ఞ నొసగె
దూతను వధియింప దొరలకు తగ దది
దోషంబనియె నా విభీషణుండు
తగిన శాస్తిని చేసి తరలించు డనగానె
అసురులు నీ తోక నదిమిపట్టి

తే॥ యగ్గిబెట్టిరి మిగుల సాహసము జేసి
తల్లి సీతమ్మ వరమున తాపమణిగె
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీప్రసన్నాంజనేయ!

## శ్రీలంక స్మశాన వాటికగా మారుట

సీ॥ 85 లంకను తిలకించు లక్ష్యాన నగ్నిని
భరియించితివి రామ భక్త నిన్ను
వీధులవెంబడి వెర్రిగా త్రిప్పిరి
తిలకించి రసురులు తిట్టుకొనిరి
చెలగి విజృంభించి శృంఖలాలను త్రెంపి
యాకసమ్మున కేగి యాగ్రహించి
అసురేంద్రు నాకాశ హార్మ్యాల నన్నింటి
నాహుతి చేసినా వగ్ని కపుడు

తే॥ పిల్లపాపలు దహనమై పీనుగులయి
వల్లకాడుగా మారె నీ వసుధయందు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## హనుమంతుడు పశ్చాత్తాపము నొందుట

సీ॥ 86 దనుజ సామ్రాజ్యమున్ దహనము నొందించి
తాపముచే నిది తగ దటంచు
విజ్ఞులు క్షణము నావేశము నొందిన
కుదురైన కార్యముల్ కూల్చ బడవె!
ఉచితమౌనా యని యోచించి తగురీతి
చర్య గైకొనవలె నార్యులైన
ననుచు సందేశము నందించితివి గద
యాత్రము వలదని యందరకును

తే॥ నంతరాత్మతో చర్చించి పంతము విడి
సఫల మొనకూర్చుకొను దని చాటితివయ!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా శ్రీప్రసన్నాంజనేయ!

## సీతమ్మ జాడను అంగదాదివానరులకు తెలుపుట

సీ॥ 87 అసుర వీరుల నెల్ల కసితోడ కుమ్ముచు
చీల్చివేసితి వయ్య చిద్విలాస!
ముష్టిఘాతాలతో మూర్ఖుల తనువులు
నుగ్గునుగ్గుగ మారి నోటినుండి
రక్త మోడుచు నుండ శక్తిహీను లగుచు
చెల్లా చెదురు నైరి శీఘ్రముగను
కార్యము నెరవేరి గగన మార్గమునందు
అంగదాదుల చేరి యందరకును

తే॥ సీత జాడను నెరిగించి చింత దీర్చి
పరవశింపను చేసిన వర కుమార
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయ మొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## సీతమ్మ చూడామణిని శ్రీరామునకందించుట

సీ॥ 88 ఆనవాలుగ సాధ్వి యందచేసిన మేటి
చూడామణిని చూపె సుందరు డిట
రఘుకుల సోముడు రామ చంద్రుడు కాంచె
మదిలోన పూర్వులు మెదలి రపుడు
కార్య దక్షు డనుచు కపివరు నెల్లరు
శ్లాఘించి రత్యంత సమ్మదమున
సమరమ్మునకు బూని సంసిద్ధులై కపుల్
శీఘ్ర ప్రణాళికల్ చేసిరచట

తే॥ అసురులను తుద ముట్టింప నడుగు లిడుచు
జయజయ ధ్వను లందిరి భయము లేక
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## అజేయుడు

సీ॥ 89 దనుజరాజ్యముపైన దండయాత్రకొరకు
వారధి నిలిపిరి ధీర కపులు
చేతగుట్టలుబట్టి చెండాడినట్లుగా
విసరిరి సంద్రాన వేగముగను
పర్వతమ్ములు తమ వాలమ్ములను చుట్టి
పెకలించుకొని తెచ్చి పేర్చు చుండ
రామ కార్యమునందు రంజిల్లి యుడతయు
ఇసుకలో దొర్లాడి యెత్తి తెచ్చె

తే॥ అసుర లోకమునెల్లను హడలునటుల
విజయ మందించితివి మేటి విజ్ఞుడవయ!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## స్వామిని మౌనమువీడుమని ప్రార్థించుట

సీ॥ 90 రామ రావణ యుద్ధ రంగాన సౌమిత్రి
మూర్ఛిల్లె నసురులు మురియుచుండ
సంజీవికొండను సద్భక్తితో దెచ్చి
ప్రాణము నిలిపిన పరమ భక్త!
వాలము ఝళిపించి వైరుల చుట్టేసి
విచ్చలవిడిగను విసరినావు
ప్రాణ భీతిని పొంది పరుగిడుచుండగా
వెంటాడి చంపిన వీరుడవయ!

తే॥ దీన రక్షక! రావయ్య! మౌన మేల?
దుష్ట శక్తుల దునుమాడు కష్టమనక
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
నభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## కర్షకులు వర్షాల కొరకై పరితపించుట

సీ॥ 91 కర్షక మిత్రుల కష్టార్జితము నెల్ల
వ్యర్థమై పోయె నిరర్థకముగ
వ్యయమెంతొ భరియించి పంట లెన్నియొ వేసి
వరుణుని కరుణకై యరసి రిచట
చుక్క రాలక కంటి చుక్కలే రాలుచు
బిక్కమొగముతోడ బక్క చిక్కి
కలవరమొందుచు కరములు మోడ్చిరి
మొర వినిపించిరి సురలపతికి

తే॥ శివుని గుడి చేరి భక్తితో చెలగి యాడి
వరద పాయసమ్ము విడిరి చెరువునందు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## గ్రామ రక్షకుడు

సీ॥ 92 ధరణిపై నూరూర దక్షిణముఖుడవై
వరలెడు దైవమా! వాయుతనయ!
ఇంటిల్లి పాదుల కంటికి రెప్పవై
కాపాడ రావయ్య కపికుమార!
గాలి ధూళిని నీదు వాలమ్మునకు చుట్టి
విసరివేయగ రమ్ము విమల చరిత
సరిహద్దు దాకను సారించి నీ దృష్టి
రక్షణ కల్పించు రామదూత!

తే॥ దుష్ట బుద్ధులన్ దునుమాడు దొరవు నీవు
సత్వ సంపన్న! మొర విని సాగిరమ్ము
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## హనుమంతుని విద్యాభ్యాసము

సీ॥ 93 అర్కుని బోధనల్ తర్క శాస్త్రము లెల్ల
వినుటకై చేరిన విజ్ఞుడవయ!
ఉదయాద్రి యస్తాద్రి కుదురుగా పాదాల
మధ్యన నిలిపి నీ మహిమ తోడ
శ్రద్ధాళువై సాగి బుద్ధిగా విద్యలన్
సంగ్రహించితి వయ్య సఫలముగను
శిష్యులు గురువులన్ చేరు తీరును భువి
చాటి చెప్పితి వయ్య మేటిగాను

తే॥ నేటి యనుబంధములు చూడు నీచ మాయె
వెఱ్ఱి చేష్టలన్ మాన్పుమా విబుధ వర్య!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## రజోగుణ వర్తనము

సీ॥ 94 పొగరుతో మేమే ప్రబోధకులమనెడి
గర్వాంధకారులు కలరు నేడు
గుణములందున రజో గుణ మిది యనిగీత
తేట తెల్లముగాను తెలియ పరచె
అసుర లక్షణములే యవివేకులం దెల్ల
గోచరించును గొప్ప గుణములుగను
రక్షణ కవచమై రాజీ పడగనీక
నడిపించు విడువక నరకమునకు

తే॥ సాత్విక గుణమ్ము హృదయాల సంతరించి
తరిమివేయుము మూర్ఖంపు తత్వమెల్ల
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ

## ఉమ్మడి కుటుంబ వ్యవస్థ

సీ॥ 95 నాటి కుటుంబము మేటి వ్యవస్థను
మట్టిలో కలిపిరి మనము లేక
స్వార్థాన నిత్యము సకలార్థముల నెల్ల
సంతానమున కని సంతరించి
అనుబంధముల నెల్ల నతి దూరముగ నుంచి
చరియించుచున్నది సంఘమిపుడు
అర్థరహిత మైన వ్యర్థ సంపాదనల్
సమకూర్చుకొనుటకై శ్రద్ధ నిలిపి

తే॥ అర్థమే పరమార్థమైనట్టి దుర్ది
నములు వచ్చెను వానిన్ దరుమగ లేవ!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## ఈనాటి విచ్చలవిడి బదిలీలు

సీ॥ 96 ఉన్నత విద్యలో నొజ్జ బంతుల మని
బదిలీలు కోరిరి పంతులయలు
సౌకర్యముగనున్న సంస్థలన్ గుర్తించి
పట్టణాలను చేర పరుగులిడిరి
దక్షిణ ముత్తరాల్ దండిగా నందించి
చిత్తమున్న దరికి చేరుకొనిరి
అధికార వర్గము లండదండ లొసగి
భ్రష్టు పట్టించిరి పల్లెనిపుడు

తే॥ వింతగా బది "లీల"లు విస్తుగొలిపె
బోధ చేయుట సాధ్యమా పొందికగను
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
భయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## హైదరాబాద్ కూడళ్ళలో అక్షయ పాత్రలు

సీ॥ 97 క్షుద్బాధపరుల సంక్షోభము తొలగింప
భాగ్య నగరమందు భక్తు లైరి
కూడళ్ళలో పొట్ట కూటికై నిత్యము
శ్రమచెందు జీవులన్ స్వాగతించి
కమ్మని వంటకాల్ కడుపార పెట్టిరి
అన్నపూర్ణగ నేడు నాదుకొనిరి
ధనిక పేద యనెడి తారతమ్యము లేక
తరలుచుందు రిటకు దండిగాను

తే॥ ఉచిత భోజనమైనను నొనరుగాను
సాగుచుండెను మధ్యాహ్న సమయమందు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ

## హైదరాబాద్‌లో రద్ది

సీ॥ 98 అవసరాల కిటకు నరుదెంచి పట్టణ
వీధులు పరికించి వెర్రి నైతి
వాహనా లెన్నియో వరుసగా నరుదెంచె
బుయ్యి బుయ్యి మనుచు బొబ్బరించె
కాలుష్య వాయువుల్ క్రమ్మెను నాచుట్టు
నూపిరి సలుపక యోపకుంటి
కంటి ముందర నున్న కార్యాలయమునకు
గంటలతరబడి గమనమాయె

తే॥ దారి దాటుట కొరకు నే తడబడితిని
కూలద్రోయునేమో యని కుమిలిపోతి
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## క్రిక్కిరిసిన వాహనములు

సీ॥ 99 భాగ్యనగరమందు వాహనాల్ వరుసగా
వివిధ వర్ణాలతో విభ్రమముగ
జంతు జాలము పక్షి సంఘము మిళితమై
పరుగు పందెము నందు తరలు నటుల
శీఘ్రమే లక్ష్యమున్ చేర సంకల్పించి
కూనలన్ నేలపై కూల్చివేసి
రక్తమున్ గ్రోలెను రాబందుల వలెను
దేహమ్ములను కుమ్మి దున్నుకొనుచు

తే॥ పంపుచున్నవి యమపురి గుంపులుగను
చోదకుల వేగమును మాన్పు సుగుణధామ!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!

## ఒప్పంద బోధకుల మరణాలు

సీ॥ 100 ఒప్పందమునుకూర్చి రొజ్జబంతులనెల్ల
పాఠాలు బోధింప పట్టినిలిపి
అరకొరవేతనాలందించిరేలికల్
భద్రతకోరగా భరమనిరి
సృష్టి కర్తకు గూడ దృష్టి లోపమొ యేమొ
తిలకించి బాధలన్ తీర్చ దేల
అర్ధాంతరమ్మున నవనిపై తనువులన్
చాలించు దినములు సాగివచ్చె

తే॥ అయ్యో! ఆలు పిల్లలు నెల్ల రాగ మైరి
బ్రతుకు నీడ్చుట యెట్టులో వార లిపుడు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## శతకమునకు సహకరించిన వారు

సీ॥ 101 దివ్య స్వ రూపుడు దేవాది దేవుడు
హృదయ మందున నిల్చి ముదము తోడ
శ్రవణ దృశ్యాలను చక్కగా వర్ణింప
సూచించె సొగసైన సూచనలను
పగలు రాత్రియు నైన పట్టుదలను నిల్పి
పద్యాల నల్లించె చోద్యముగను
స్వల్ప కాలము నందు చక్కని సీసాలు
వ్రాసి పంపించితి వరుసగాను

తే॥ శ్రీనివాసులు దార్లయు చివరిదాక
తగిన సూచన లందించి సాగు మనిరి
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయ మొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## జ్ఞాన ప్రదాత - సుబ్బయ్యగారు

సీ॥ 102 పల్లె పాలెమునందు ప్రముఖుడు సుబ్బయ్య
నిరుపేదవారిపై నెనరుచూపి
చదువు సంస్థల తోడ సద్గురువుల నిల్పి
సంస్కరింపను జేసె శ్రద్ధతోడ
యేపూర్వ పుణ్యమో ఈ పల్లెలో బుట్టి
సత్సంఘమున కూడి సాగితిపుడు
అజ్ఞానమును మాన్పి విజ్ఞానమార్గమున్
చూపిరి చల్లని చూడ్కు లుంచి

తే॥ జ్ఞాన మొసగిన మాన్య విజ్ఞానులకును
గుడిని నిర్మించితిని నాదు గుండె లోన
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
భయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ

# తెలుగు భాష ఆనాటి వైభవం

సీ॥103 భరత వర్షమునందు ప్రఖ్యాతిగాంచిన
రసికులౌ రాజాధిరాజు లెల్ల
రాగాలు తీయుచు రమ్యమై వెలిగిన
తెలుగు భాషను చాటి దెసలకెల్ల
కవులను పోషించి ఘనకీర్తి నార్జించి
భరత వీరులగూర్చి భద్రముగను
కావ్యేతిహాసాలు ఘనపురాణాలు ప్ర
బంధాల నల్లించి బంధురముగ

తే॥ ధర్మసూక్ష్మాల నొసగిన కర్మభూమి
మాతృభాషలన్ మరచి రీమాన్యు లిపుడు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

# తెలుగు భాష ఈనాటి దీన స్థితి

సీ॥ 104 భాషాభిమానము లేశ మైనను లేని
యేలికల్ మన రాష్ట్ర మేలినారు
విశ్వ వి జ్ఞానము విస్పష్ట మై యున్న
దేశ భాషల నెల్ల తెగడి త్రోసి
పర భాష కౌగిలిన్ మురిపించి యువతను
మాతృ భాషను నేడు మంట గలిపి
అట్టహాసము తోడ హై టెక్కులను నిల్పి
ధనము సంపాదింప తరలు మనిరి

తే॥ తేనె లొలికించు మన భాష తెగులు సోకి
దిగులుతో నేడు కనిపించె దీనముగను
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## ప్రస్తుత కర్తవ్యం

సీ॥ 105 సంపాదనార్థమై సాంకేతికత వచ్చె
వేష భాషలు మారె వెఱ్ఱిగాను
పాశ్చాత్య సంస్కృతి పరిఢవిల్లెను నేడు
భోగలాలసులైరి పోర లిపుడు
రక్తబంధాల విరక్తితో కసరిరి
తోడునీడల కెల్ల దూరమైరి
ఏకాకులై నిల్చి చీకాకు హృదయులై
మానాభిమానాలు మరచి రిపుడు

తే॥ భరత సంస్కృతి నేర్పించు భాషలనిక
మదిని నిలబెట్టి రక్షించు మాన్యచరిత!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

## పాలెం ప్రసన్నాంజనేయాలయము

సీ॥106 శ్రీశైలవాసుని చిత్తమందున నిల్పి
మార్గాన నరుదెంచు మనుజులెల్ల
విశ్రాంతి కోరి ని న్నాశ్రయింతురు తమ
భోజనాదుల నెల్ల పూర్తి చేసి
ఆహ్లాద వాయువు లందుచు నుండగా
కునుకు దీయుదు రిట కోర్కెతోడ
స్వప్నదర్శన మంది సంతోష భరితులై
నిలువెల్ల పులకించి నిదుర వీడి

తే॥ పాద పద్మాల పైబడి పరవశమున
సాక్షిభూతుడ వని నిన్ను చాటిరయ్య!
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

# ఆనాటి ముడి ధాన్యములు

సీ॥ 107 పశువుల పేడతో పరిమితంబుగ రైతు
చక్కని పంటలన్ సాగు చేసె
ముడిధాన్యములు పక్వ మొనరించి నిత్యము
నారగించిరి నాడు హాయిగాను
దేహంబులత్యంత దృఢములై రోగాలు
దరిచేరకుండెను. ధరణినిపుడు
విషపు టెర్వులు జల్లి విరివిగా పండించి
ఆరగించిన వార లందరకును

తే॥ వ్యాధు లెన్నియో సోకుచు వరుసగాను
తరలుచున్నారు యమపురి దైన్యముగను
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

# స్వార్థపరులు

సీ॥ 108 కుటిలమౌ వ్యాఘ్రూలు గోముఖమ్ములతోడ
చరియించునటులనే స్వార్థపరులు
మనసులో మోసాలు కనిపించకుండగా
వ్యవహరించెద రెప్డు వసుధయందు
ప్రాజ్ఞుల సూచనల్ పాటింప బూనరు
వెఱ్రి వేషాలతో విఱ్రవీగి
భజన పరులతోడ పబ్బము గడుపుచు
కొనసాగుచుందురు కుట్రపరులు

తే॥ లాభమే మూర్ఖచిత్తుల లక్ష్య మెపుడు
ఉనికికై పోరుచుందురే యుత్తములటు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద!
అభయమొసగుమా! శ్రీ ప్రసన్నాంజనేయ!

# కృతఘ్నులు

సీ॥ 109 అన్నార్థులనుకాంచి యనుజన్ములుగనెంచి
భుక్తినొసంగిన పూజ్యులనును
చింతలనెల్లను శీఘ్రమే తొలగించి
వెన్నుదన్నుగనున్న విజ్ఞులనును
కష్టాలకడలిని కడదాక దాటించి
సహకరించినయట్టి సజ్జనులను
అజ్ఞానమునుమాన్పి సుజ్ఞానమందించి
కుదురుగ నిలిపిన గురువులనును

తే॥ పుణ్యపురుషుల సేవలన్ పుడమిపైన
మరచిపోవుట సహజమే మందమతులు
ప్రస్తుతించెద పాలెము భక్త వరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ

# చిట్టీలు - మోసాలు

సీ॥ 110 శ్రమలేక డబ్బులు సమకూర్చుకొనుటకై
మార్గ మన్వేషించె మనుజుడొకడు
తమ తాత తండ్రులు ధర్మాత్ములని చెప్పి
నమ్మించెను ప్రజల నెమ్మదిగను
కష్టార్జితము కొంత కనుకున్నవారిపై
పొదుపు చేయుడటంచు పొందుపరచె
రక్ష నేనని చెప్పి లక్షల చిట్టీలు
కుదురుగ నడిపించి కోట్లు కూర్చి

తే॥ యూరి పొలిమేరలను దాటి పారిపోయె
బాధపడుచుండి రెందరో బాధ్యులిచట
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ

## మత సామరస్యము

సీ॥ 111 చిద్రూపుడొక్కడే సృష్టి యంతటనుండ
విశ్వసింపక జనుల్ వింతగాను
లెక్కకు మించిన ముక్కోటి దేవుళ్ళ
నడుగడుగున నిల్పిరవనిపైన
కుల, మత, వర్గాలు, గుడి, దర్గ, చర్చీలు
చిత్తానుసారము స్వీకరించి
వ్రతములు, గందాలు, ప్రార్థనల్ చేయుచు
ముక్తికై యాశించి భక్తులైరి

తే॥ మహిని మత సామరస్యమున్ మరువ కెపుడు
ముందు నిల్చిన వారలు హైందవులెగ
ప్రస్తుతించెద పాలెము భక్తవరద!
అభయమొసగుమా శ్రీప్రసన్నాంజనేయ!

## స్వామి దేహముపై వెండి తొడుగు

సీ॥ 112 విభ్రమపరిచెను వెండితొడుగు నీదు
తనువుపై నత్యంత తళుకులీనె
భుజముపైననుగద పొందుగా నిలబడి
అరివీరవర్గమున్ తరిమివేసె
ఘనమైన వాలము గాలి దయ్యాలను
చుట్టి విసరివేసె చోద్యముగను
దరహాస వదనము దరిచేరు భక్తులన్
స్వాగత మందించె సంతసమున

తే॥ మొలను మువ్వగజ్జెలు చేయు మ్రోతలు విని
పరవశించితి తనువును మరచితినయ!
ప్రస్తుతించెద పాలెము భక్తవరద!
అభయమొసగుమా శ్రీప్రసన్నాంజనేయ!

## ఆధ్యాత్మిక చింతన

సీ॥ 113 దేహభ్రాంతిని వీడి దీక్షబూనితినయ్య
యాధ్యాత్మికతవైపు నడుగులిడితి
ఉత్సాహభరితునై సత్సంఘమును కోరి
విబుధులకొరకయి వెదకుచుంటి
కంటికి కనరాక కలత చెందితినయ్య
దారిచూపుము నన్ను దరికి చేర్చు
నిత్యము నీ ధ్యాస నిలుపుదు మనమున
నీకథలల్లుదు నీరజాక్ష!

తే॥ భక్తమందార నీపాద పద్మములను
వీడ నేనాడు నామొర వినుము దేవ!
ప్రస్తుతించెద పాలెము భక్తవరద!
అభయమొసగుమా శ్రీప్రసన్నాంజనేయ!

## చాలీసా పారాయణము

సీ॥ 114 శ్రీయాంజనేయుడా! చిన్మయ రూపుడా!
బాలాంజనేయుడా! భానుతేజ!
భక్తాంజనేయుడా! ప్రవిమల చరితుడా!
చంచలత విడి సత్సంఘ మిచట
యూరికిపొలిమేర నుత్తరదిక్కున
నీదుపురాతన నిలయమందు
భక్తితో చాలీస పారాయణము చేసి
ప్రణతులర్పించిరి పంచముఖుడ!

తే॥ స్వామి! వీరాంజనేయ! సత్భక్తియుతులు
వివిధముల రూపముల నెల్ల వేడుకొనిరి
ప్రస్తుతించెద పాలెము భక్తవరద!
అభయమొసగుమా! శ్రీప్రసన్నాంజనేయ!

## కార్తీకమాసం -మండలదీక్షలు

సీ॥ 115 కార్తీక మాసాన ఘనముగా నింటింట
సంకీర్తనములుండు సొంతముగను
దండిగా భక్తులై మండలదీక్షలు
కొనసాగుచుందురు కోర్కెదీర
వైభవోపేతమౌ వ్రతమభిషేకముల్
నిత్యము జరుగు నీ నేలయందు
గొంతు లన్ని శరణుఘోషలు పలుకగా
ధ్వనియించె నిట ప్రతి ధ్వనులతోడ

తే॥ శుచియు శుభ్రత పాటించి శుభము కొరకు
మత్తు మాంసాలు వీడిరి చిత్తగించి
ప్రస్తుతించెద పాలెము భక్తవరద!
అభయ మొసగుమా శ్రీప్రసన్నాంజనేయ!

## అబలల అత్యాచారాలు - హత్యలు

సీ॥ 116 క్షణకాలసుఖము తత్క్షణముగా వాంచించి
మగువలకొరకయి మనము నిలిపి
పసిపాప మొదలుగా పండు ముదుసలుల
వీడకుందురు వెర్రివెధవలెల్ల
మత్తుమాంసాలను చిత్తుగా సేవించి
కైపెక్కి దరినున్న కాంత నరసి
మనసంత వికలమై మానవమృగములై
నఖశిఖాంతముదాక నాసుబెట్టి

తే॥ అసురజాతి సిగ్గిలునటు లబలలనిట
అనుభవించి రగ్నికి మూర్ఖులాహుతిడిరి
ప్రస్తుతించెద పాలెము భక్తవరద
అభయమొసగుమా శ్రీ ప్రసన్నాంజనేయ!